# వసురాయకవికృత గ్రంథములు

పుస్తకభాండాగారములను స్థాపించినవారల కెల్లరకు మా యొద్దనుండిన గ్రంథములన్నియు సగము వెలకే ఇయ్యబడును ఇదియే మావలన వారికిఁ గలుగు నుపకారమని యెఱుఁగునది.

| | ర. | అ. | పై |
|---|---|---|---|
| 1 అభిజ్ఞానశాకుంతలము. (లఘుటీకాతాత్పర్యవిమర్శ సహితము.) | 1 | 0 | 0 |
| 2 వేణీసంహారము. (F. A. text for 1895 and B. A. text 1900) | 1 | 0 | 0 |
| 3 మల్లికామారుతప్రకరణము (శృంగారరస ప్రధాన నాటకము. (M. A. text for 1912) | 1 | 0 | 0 |
| 4 ప్రబోధచంద్రోదయనాటకము (శాంతరసప్రధానము) విద్వాన్ పరీక్షకుఁ బఠనీయముగా 1912 for 1917 వఱకు నేర్పఱుపఁ బడినది. | 0 | 10 | 0 |
| 5 చండకౌశిక నాటకము (హరిశ్చంద్రకథ) (B. A. text for 1903) | 0 | 8 | 0 |
| 6 విక్రమోర్వశీయనాటకము (శృంగారరసప్రధానము) | 0 | 8 | 0 |
| 7 సూక్తివసుప్రకాశికము. లోకదృష్టాంతసమన్విత నీతిపద్యగ్రంథము 1892, 1893 సం॥ మెట్రిక్యులేషన్ పరీక్షకును 1918 సం॥ నాల్గవఫారము పరీక్షకును బఠనీయగ్రంథముగా నేర్పఱుపఁబడినది.) 4 వ కూర్పు | 0 | 12 | 0 |
| 8 సుగుణప్రదర్శకము (నీతిపద్యగ్రంథము) 1 వ ఫారమునకుఁ బఠనీయముగా నేర్పఱుపఁబడినది. | 0 | 4 | 0 |

శ్రీరస్తు.

# శ్రీసూక్తివసుప్రకాశకము.

ఇది

ప్రస్తుతము రాజమహేంద్రవరంబున
నను వారి మొదటితరగతి కలాశాలయందు నాంధ్రోపాధ్యాయుఁడగు

వడ్డాది సుబ్బారాయని చేత

రచియింపఁబడియె.



అయిదవకూర్పు ప్రతులు ౧౫౦౦.

రాజమహేంద్రవరము.

శ్రీవిద్యానిలయముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

౧౯౧౭.

[సంకలితము] [దీని వెల ౧-౨ అణాలు.

# అభిజ్ఞానశాకుంతలము.

[వసురాయకవిరచితము.]

———:o:———

ఇది కాళిదాసమహాకవి విరచిత మయిన సుప్రసిద్ధ సంస్కృత నాట
రాజమునకుఁ దెనుఁగు. ఇందు మూలానుగుణము లయిన గద్యపద్యములు
త్రమే కాక పెక్కుతావుల గూఢము లయి యున్న సరసభావములు, ర
జనమనోరంజకములుగా లఘుటీకను సవిమర్శముగా విశదీకృతము లయి
న్నవి. సావధానముగాఁ జదువువారికి గ్రంథము, మూలములోని యనేక ర
స్యములను గ్రహించుటకు మేలిసాధన మగు ననుట యతిశయోక్తి గా
శైలి దెలియుటకై క్రిందఁ గొన్నిపద్యము లుదాహరింపఁబడుచున్నవి.

దీని వెల 1—0—.0 మాత్రమే.

ఉ. ఏయకు మేయ కావిశిఖ మీసుకుమారపుజింక మేనిపైఁ;
ద్రోయఁగ వచ్చునయ్య తూలరుంగుమిమీఁదను వీతిహోత్రమున్?
హా! యతిలోల మాహరిణకావళిజీవిత మేడ? నేఁడ నీ
సాయకముల్ నిశాతఫలసంకలితంబులు సారపుంఖముల్?

ఉ. వ్రాసి పటంబులోన విధి ప్రాణము వోసెనొ? మానసంబునన్
జేసెనొ రూపసంచయము చేతను? గా దటు; వేధశిల్పవి
న్యాసవిభుత్వముం, గలికియంగకసౌష్ఠవ మింత చింతనం
జేసినఁ, గన్య యన్యవిధి స్త్రీమణిసృష్టి యటంచుఁ దోఁచెడున్.

చ. శ్రమము హరింపఁగాఁ దగినచల్లనితామరపాకుఁదాళవృం
తమునను నార్ద్రవాయుచలనం బొలయన్ మెల్లమెల్ల వీతునా?
నిముసము, పద్మతామ్రములు నీయడుగుల్ గదియించి మామకాం
కముపయి, నీకు నెట్టులు సుఖం బటు పట్టుదునా నరోరువా?

చ. పలుకు నరేశ్వరుం డెటులు, వాస్తవ మట్టుల యైతి వేనియుం,
గులమునపాతకిం జెడినకూఁతుర వీటికి నీవు తండ్రికిన్?
దలఁగదు నైజశుద్ధచరితం బని నిక్క మెఱింగి యుంటివా,
నిలు పతియింట బానిసగ నేనియు; నీ కది చాల మే లగున్.

# విషయసూచిక.

శ్రీ ర స్తు.

శ్రీ త్రిమూర్త్యాత్మనే నమః.

## ఇష్టదేవతాప్రార్థనము.

శ్రీకరనామ! మువ్వేలుఁగుసీను! మహోజ! సహస్రపాద; దు
ర్లోకమహాజసా! యుదయాంతితేను స్తమసా! జగత్త్రయీ
డ్యా! కమలాఢ్య! శోషితభయంకరపంక! నిరస్తభక్తహృ
చ్ఛోకకలంకశంక! దయఁ జూడవె దేవ! ముదావహంబుగన్.

## కవి స్తు తి.

—:o:—

చ. పలికినపల్కు వేదమయి భాసిలువాగనుశాసనాదిమూ
ర్తులను, దమత్కవిత్వదము దొల్లిభాస్కరసోములన్, దమ
జ్జ్వలకులజాతు లౌచు వరుసన్ గయితన్ మహి నిర్మలి న్విని
ర్మలమతి నేలుతొంటికవిరాజుల నంతఁ బ్రస్తుతించెదన్.

## ప్రతిజ్ఞాదికము.

ఉ. చేసితి మున్ను దేవముఖశిల్పికలం దగి పెక్కునీతులన్
భాసిలఁ గందగీతముల బాలురకై కడుతేటమాటలన్
నే సుగుణప్రదర్శకము; నిచ్చలు నద్ది ప్రవాసి కావుటం
జేసి, యొసంగ నాకు వలసెన్ సహవాసిని జేసి దానికిన్.

ఆ.వె. కూడఁ బోవువాఁడు గుణహీనుఁ డైనను,
వాఁడుఁ జెందును దోడివానిఁ జెలుముఁ ;

ద్రోవ కిప్పు డేను దోడొనర్చెడుకృతి
దానికన్న మహిమ పూన వలయు.

తే. గీ. సకలపద్యోత్తరార్థలౌకికనిదర్శ
నములు పూర్వార్థములకుఁ బ్రాణములు గాఁగఁ,
జంపకోత్పలములను బుస్తక మొనర్తు,
జగతి 'సూక్తివసుప్రకాశిక' మనంగ.

సీ. భువనజాతంబు లామోదపూర్ణములుగా దినము తప్పక ప్రోచు దేవుఁ డెవఁడు
సకలస్థలములందు సర్వజీవులు జీవనముఁ బొందఁ ఘనకారణం బెవండు
దా నిశ్చలుం డయి మానితాజాండభాండములకుఁ జలనం బొనర్చు నెవఁడు
గురుతమోవ్యాప్తజంతుకోటికి వెండి చైతన్య మిచ్చెడుజగద్బంధుఁ డెవఁడు
తే. గీ. పరమతేజస్స్వరూపుఁ డై ప్రబలు నెవ్వఁ
డురువిసద్ధ్వాంత మడఁచు నేర్పరి యెవండు
సతత మఖిలజగచ్చక్రహితుఁ డతండె
యగుట, నమ్మ్రతుప్రీన కొనర్తు నంకితంబు,

క. ఒక్కొకటి తొంటి దైనను
బెక్కులు దృష్టాంతములు నవీనములే యిం
దెక్కడ లోపము గల్గిన
నక్కడ మన్నింపఁ గోలుతు నార్యుల నెల్లన్. 7

క. అక్కటికముతోఁ దెలుపుఁడు
నిక్కపుదోషంబు, మీకు నేఁ గేల్మొగుతున్;
దక్కరితప్పులు వట్టిన
నక్కట! మీ వాకె పరుష మగుఁ గవులారా. 8

వ॥ సు॥

# పీఠిక.

మనభాషలో మహాకవు లనేకులు విరచించిన బహు ప్రబంధములు ప్రాయికముగా శృంగారరసప్రధానము లగుటంజేసి, బాల్యంబున విద్యాభ్యాసంబు సేయఁగోరువారల కవి యనుపయుక్తంబు లగుచున్నవి. ఆయినను సకలనీతిబోధకంబులు, మనోహరకథాకలితంబులు లలితమృదుమధురపదంబులు నగుభారతాది కావ్యంబులు పెక్కు లున్నవి గాని, యవి ధ్వనిప్రధానంబు లగుటచే వానియందలిభావము లభ్యాసదశయందు గ్రహించుట యంతసులభముగాఁ గనుపట్టదు. మఱియు నాభారతాదికావ్యంబులు చదువునప్పు డనేకులు కథయందే గాని యవి యుపదేశించునీతివిషయమున శ్రద్ధాళువులు గాకుండుట ప్రసిద్ధమే కదా? కాఁబట్టి తత్తద్గ్రంథములు పండితులకుం గాని పామరుల కంత యుపకారకంబులు గావు. అయినను గొందఱు బుద్ధిమంతులు వానిలోనినీతిపద్యంబుల నేర్చి కూర్చి నామాంతరం బిడి గ్రంథరూపంబునఁ బ్రకటించిరి గాని యవి లక్ష్యము గనఁబడినప్పుడు సంతోషము గలిగింపఁజాలినవిగా నున్నవి. లక్ష్యసమన్వితంబు లయినగ్రంథంబులు గూడఁ గొన్ని యున్నవి. అయిన నాలక్ష్యంబులు తఱుచు పురాణగాథ లగుటచే, నిప్పటివారికి వానియందు నమ్మకము తక్కువ గనుక నవి విధిలేక చదువవలసిన వా

రగుచున్నారు. అట్లని వారి కాగ్రంథములయం దేసూయాదు లంతమాత్రమును లేవు. వానిలో నక్కడక్కడఁ గనుపట్టు ననురూపలౌకిక సాదృశ్యముల కానందపారవశ్యము నొంది కృతికర్తల శ్లాఘించు చుందురు. ఈ మొదలగు ననేకాంశ ములఁ బలుమాఱు గనిపెట్టుటచేతఁ బ్రతిపద్యమును లోకదృ ష్టాంతసమన్వితంబుగా నుండు నీతిబోధకగ్రంథ మొకటి మన యాంధ్రభాషలో నుండిన విద్యార్థుల కత్యంతోపయుక్తముగా నుండును గదా యని యూహించి, మదీయసామర్థ్యం బంతకుఁ జాలకున్నను, సర్వేశ్వరుఁడు నిర్మించిన ప్రపంచమను మహా గ్రంథము విస్పష్టముగాఁ గన్నులయెదురఁ బొడకట్టుచుంటం బట్టి దానిసాహాయ్యమున నామనోరథము నెఱవేఱ వచ్చు నని యుత్సహించి, పరమాత్మునిపయి భారమువయిచి యేత్గ్రంథ రచన కారంభించితిని. కుశాగ్రబుద్ధులు, కూలంకషప్రజ్ఞులు నగు కవివర్యు లనేకు లుండ నాయట్టి యసమర్థు నిట్టి కార్యము నకుఁ బ్రేరించిన యీశ్వరుని కారుణ్యమహిమల నేమని కొని యాడుదును? వానిపాదారవిందముల కానందముతో వందనం బులు సలిపెదను.

20—12—1884.

వడ్డాది సుబ్బారాయఁడు,

రాజమహేంద్రవరము.

# PREFACE.

—:o:—

As almost all the works of our poets treat of the subject of love, they cannot be read by beginners with much profit to them. There are however some works in our language such as the Mahabharata which contain many moral stories. The real sense those are intended to convey lies so deep that t he reader whose mind is mostly occupyied with the story, cannot arrive at it. They are, therefore, not of much use to the beginner. To supply this want, selections of moral verses from standard works, have been published. But they have not succeeded in their aim, as a truth cannot be well impressed upon the youthful mind, unless it is accompanied with happy illustration. Some works there are where apt illustrations are given, but most of them being taken from Puranic stories not believed as true by the present age they do not command as much success as works of the sort deserve. Thinking, therefore, that a work, where every truth it teaches, is illustrated by examples from nature, will be of utmost use to students, I have undertaken the present work.

If the study of this work can open to students, the hidden treasures of the book of nature and instruct them while giving them delight at the same time, I will have attained my reward.

In conclusion, I have to offer many thanks to the REV. F. S. DIETRICH, M.A. for his having kindly assisted me in getting this book printed.

*Rajahmundry.*
*December*, 20/1884. V. SUBBARAYUDU.

# అయిదవ కూర్పు పీఠిక.



పౌరాణికగాథోదాహరణసమన్వితంబు గాక లౌకికదృష్టాంతపురస్సరమయిననీతిబోధకపద్యగ్రంథ మొకటి యుండిన నీకాలమునకు మిక్కిలి యుపయుక్తముగా నుండునని సకారణముగాఁ బ్రథమపీఠికయందు నేను వివరించితిని. ఆంధ్రదేశమందలి దీనివ్యాప్తినిబట్టి తత్పీఠికను నేను వ్రాసినయంశములు యథార్థములే యని దృఢనిశ్చయము నాకుఁ గలిగినది. సర్వకళాశాలాధికారులు 1892, 1893 సంవత్సరములయందు వరుసగా దీనిప్రథమద్వితీయభాగములు ప్రవేశపరీక్షకుఁ బఠనీయములుగా నిర్ణయించిరి. మఱియుఁ గలకత్తా ప్రెసిడెన్సీలోఁ బ్రవేశపరీక్షకుఁ బోవఁ దలఁచి తెలుఁగు దేశభాషగాఁ గయికొను వారికి నిదియే పఠనీయగ్రంథమయినట్లు తత్తద్విద్యార్థులు పుస్తకములకొఱకు వ్రాసినయుత్తరములవలనఁ దెలియవచ్చినది. శ్రీడైరక్టరుదొరగారయిదవఫారమునకైచ్ఛికపఠనీయపుస్తకముగా 1893 సంవత్సరమున గేజటీలో దీనిని బ్రకటించి యున్నారు. ప్రస్తుతము మరల నీగ్రంథములోనికొంతభాగము నాలవ ఫారమునకు నిర్బంధపఠనీయముగా నిర్ణీతమయినట్లు 1917 వ సంవత్సరము జూలై మొదటివారములో నాకు నెఱుకపడినదని ప్రకటించుటకు సంతసించుచున్నాను. ఇట్టులు బహువిధముల దొరతనమువారిచే నాదరింపఁబడుటయే గాక జనసామాన్యముచేఁ గూడ నీపొత్తము విశేషసమ్మానము గాంచుచున్నది. దీనిపయి మంచియభిప్రాయము గలిగి యనేకులు వ్రాసినయుత్తరములు పెక్కు లున్నవి గాని, యవి యిందుఁ బ్రకటించుట యనావశ్యకము. మొదటి కూర్పునందలి పద్యములలో నక్కడక్కడ దోషములు దొలఁగించుటకును గుణములు హెచ్చించుటకును నాకుఁ దోఁచినవిధమున నీతూరి కొన్ని మార్పులు చేసి యున్నాను. ఇంకను దీనియందనేకలోపము లుండవచ్చును వానిని గూడ నౌచితి ననుసరించి మరియొక కూర్పున నేను సవరించుకొనుటకుఁ దమకు దోఁచినవి దయతో నాకుఁ దెలుపవలయునని విద్వన్మిత్రుల నాదరపూర్వకముగా వేఁడుకొనుచున్నాను.

ది 4—8—1917<br>రాజమహేంద్రవరము.



విధేయుఁడు,<br>వడ్డాది సుబ్బారాయుఁడు.

## PREFACE TO THE FIFTH EDITION.

---:o:---

The encouragement that was given to me both by the Director of public Instruction, Madras, who approved of the use of this volume as a suitable Text Book for the V. Form and by the Madras university who selected the first and second portions of this book for the Matriculation Examination in the years 1892 & 1893 respectively as also the patronage that was extended to me by the public, who wrote to me frequently in token of their high appreciation of this Volume, have induced me to bring out this edition. There was also some demand for these books from outside the Presidency from which I am led to conclude that the book was also prescribed as Text Book in Telugu for the Entrance Candidates of the sister universities. The Director has prescribed it for V Form in 1893. Now I am glad to hear that it has been again approved as Cumpulsory Text for IV Form this year. I have made some additions and improvements to the first edition that the public and the Educational authorities will continue to treat this also kindly as they had done the one before. Any suggestions for improvement will thankfully be received by the author and the necessary corrections, if any will be made in the next edition.

*Rajahmundry,*
4—8—1917. } V. SUBBARAYADU.



శ్రీరస్తు.

# శ్రీసూక్తివసుప్రకాశకము.

## ప్రథమభాగము.



### గురుశిక్ష.

శ్రీయుతసత్ప్రవర్తనముఁ జెందక స్వేచ్ఛఁ జరించు బిడ్డ, లేఁ
బ్రాయమునందు శిక్ష ఋజుపద్ధతి నేర్పమి; ముందు శక్యమే?
కాయలు పొట్లతీఁగలను గల్గుడు ఱాలను గట్ట కుండినన్,
వేయి జనించు వంకరలు; వెన్కను దీర్పఁ దరంబె? మిత్రుఁడా!

౨. జ్ఞానసముద్భవంబునకుఁ గారణ మొక్కటి యుండఁగావలెం;
గాని విమోహ ముప్పతిలఁ గారణ మక్కఱ లేద దెట్లనన్,
భానుఁడొ శీతభానుఁడొ నభంబునఁ దోఁపక వెల్గు గల్గునే?
తానుగ సంభవించుఁ గద దట్టపుఁజీఁకటి? చూడు మిత్రుఁడా.

౩. శిక్షితు లైనవారలు విశేషబహూకృతి గాంతు రెందు; ని
ర్లక్షితు లై పరాభవపరంపర వేఁగెద రెం దశిక్షితుల్;
తక్షకుచేతఁ జెక్కఁబడు దారుశిలల్ ప్రణుతుల్ వహించుఁ; బ్ర
త్యక్షము చూడు, చెక్కనివి యావములోఁ బడి కాలు; మిత్రుఁడా. 3

౪. వేములు శిక్షమీఁద నె వివేకద మక్షర మంటుఁ; గాని గా
రామునఁ జేసి దుర్గుణపరంపర దక్కమ యంట దెద్దియున్;
భూమిని బెల్లు ద్రవ్వి యిరుమ్మలు దున్నినఁ గాక, ముండ్ల చె
ట్లే మొల కెత్తుఁ, గాని మఱి యెట్టులు ధాన్యము లంటు? మిత్రుఁడా.

ఉ. ప్రేముడి పెద్ద యైయుండినను, బెట్టుట పోయుట యొప్పుఁ; గాని గా
రామున బిడ్డలన్ విడువ రాదు సుమీ మఱి దోష ముండినన్ ;
గోమునఁ బెంచునంగమునకుం గలు పొక్కుడ సంభవించినన్ ;
దా మహి వెజ్జు, శస్త్రమున దానిఁ గుదుర్పక యున్నె ? మిత్రుఁడా.

ఉ. క్షితిపయిఁ జిన్నబిడ్డలకుఁ జెడ్డగుణం బలవడ్డ, దాన నా
వెత, మును గన్నవారలది; వెన్కను వారల దౌను; గొల్లఁడు
ద్రుతగతిఁ గొఱ్ఱు గట్టినను, నాఁగక పాల్గుడువంగఁ బోవ, ముం
దలిపరితాప మావులది; యావలఁ గ్రేపుల దౌను; మిత్రుఁడా.

ఉ. శిక్ష యొనర్చి యక్షరము చెప్పి ప్రయోజకుఁ జేయు నొజ్జ నే
దక్షుఁడ నైతి నంచుఁ గడుఁ దా నవమాన మొనర్చుఁ గూళ; ప్ర
త్యక్షము, కొమ్మఁ గాల్చి పెనుదాకట సమ్మెటఁ గొట్టుకమ్మరిన్
రూక్షకృపాణమై యినుము త్రిప్పుచుఁ గోయుట లేదె? మిత్రుఁడా

చ. అవగుణముల్ తమంత హృదయంబున నుద్భవ మొందు; ముందు గా
నవి యడఁగింప కున్న, నొక టైనను నాటదు సద్గుణంబు; ని
క్కువ మిది; పిల్లు పల్లెరును గొబ్బియు నాని గ నున్నబీటిలో
వివిధము లైనధాన్యములు విత్తిన నంటు నటయ్య? మిత్రుఁడా.

## వినయము.

చ. గురుజనశిక్ష దాఁ గుదురుకొల్పు గుణంబు; గుణంబుచే మనో
హరవినయంబు గల్గు; వినయంబున నే సఫలప్రయత్నుఁడౌ ;
వరయఁ గ విల్లుకాఁడు గనయంబున మేల్గొనయంబు గూర్ప, సం
గరమున వంగి సింగిణులు గాంచుట లేదె జయంబు? మిత్రుఁడా.

చ. నిలుపఁ గ రానిగర్వమున నిక్కుచు నుండినఁ గీడు మూఁడెడుం ;
బొలుపు గ నమ్రభావమును బూని చరించినఁ జాల మే లగున్ ;

బలమున విఱ్ఱవీఁగుతనుపాళి సుబాలున నేటఁ గూలెడున్;
దలఁపను వంచుకన్నవులు త్రాసము నొందరు గాదె? మిత్రుఁడా. 10

ఉ. ఏమియు లేనివారె మహి నెక్కుడు నిక్కుచు నుందుర్; పూర్ణు లు
ద్దామత నందఱుం బొగడఁ దద్దయుఁ బూనరె నమ్రభావ? మా
రామమునందు మ్రోఁకు పడుమ్రాఁకులు వాకనువంకఁ జూచెడున్;
భూమికి వంగుఁ బత్రఫలపుష్పయుతావనిజాళి; మిత్రుఁడా. 11

చ. దళసరి చూపఁగల్గి మును దగ్గుట నైజము గొప్పవారికిన్;
దొలుత నెత్రుళ్ళిత్రుళ్ళి తుదిఁ గ్రుంగుట నైజము కొద్దివారికిన్;
జెలియలకట్ట దాఁటుటకు సింధువు వెక్కుడుఁ బోవు ముందఱ; తా
నలజడి హెచ్చ వచ్చి, యడు గంటును వెంటనె వాఁగు; మిత్రుఁడా.

చ. సిరి గల దంచు లేవడిని జెందినవారిని నవ్వఁ గూడ; దె
వ్వరి కది శాశ్వతంబు? తమ వారము నొక్కపు డట్లు నవ్వ రే?
సరసునఁ బద్మముల్ పగలు జబ్బగు కైరవిణిన్ హసించినన్,
మరలను బక్కన న్నగదె మాపది వానిని జూచి? మిత్రుఁడా. 13

చ. నయమున నెంతవాని నయినన్ సులభంబుగ లోఁగఁ దీయ నౌ;
భయమున నట్లు చేయుటకు బ్రహ్మకు నైనను దుర్లభంబు; పా
దయుగము పట్టుకొన్న నిలఁ దప్పక కూలును నేనుఁ గంతవాఁ
డయినను; జుట్టుఁ బట్టుకొన నప్పగిదిం బడునయ్య? మిత్రుఁడా. 14

చ. నతుఁ డయి శత్రు నైనను వినమ్రునిఁ జేసికొను న్వివేకి; యు
ద్ధతుఁ డయి యెల్లవా నెపుడుఁ దన్నులు దించు వసించు లాఁతి; యె
వ్వతె మనఁ, గోఁతకాఁడు నలవిత్రముతో నెఱుఁగం డె శాలికిన్?
వ్రతముగ మెట్టఁ డే గవలవాఁ డవనిం గలుఁడాడు; మిత్రుఁడా. 15

చ. ఎఱుఁగని వెన్నొ యుండు నని యెంచ కెఱుంగని దైన నొవ్వ నే
యఱచును దవ్వుత ప్పను చహంకృతిఁ బండితమాని; నెల్లు నే?

మెఱుఁగు నవీను సజ్జనుఁడె మ్రిచ్చుచుం దన తెల్వి లేమి; నం
దొలు నగి నీ యానం బిదవు పోఁ గ్వడి యుండదె కుక్క? మిత్రుఁడా.

## గుణవంతుఁడు.

---

ఉ. ప్రాకటసద్గుణంబులఁ బ్రపంచమునం గలయెల్లవారికిం
జోకలు గాక, యొక్కొకనిచక్కన చిక్కును, నిక్కువంబు; నీ
రాకర మాకరంబు మొదలౌ నొకకొన్నిటియందె కాక, తా
మేకడ మానికంబు లుదయించుట లేదు గదయ్య? మిత్రుఁడా. 17

చ. చెడుకులమందు సంభవముఁ జెందినమానవుఁ డైన, వానికిం
గడు సుగుణంబు లున్న, నతి గాంచుట కర్హుఁడు గాక గర్హ్యుఁడే?
పుడమిని గంటకాకులము భోగికులావృతమైన కేతకిం
బొడమిన వర్యగర్భదళముల్, గొనఁ బాత్రము గావె? మిత్రుఁడా.

చ. గుణులకుఁ జేయు సాయ మది కొద్దిదియైన ఫలంబు హెచ్చు; దు
ర్గుణులకు నెంత చేసినను గ్రూరత సూపక పోరదె ట్లనన్,
దృణములు వేయ నావులకుఁ, దీయని తెల్లనిపా లొసంగదున్;
ఫణులకుఁ బాలు వోయ, నిడుఁ బ్రాణము దీయువిషంబు; మిత్రుఁడా. 19

చ. ఎలమి నసాధు సాధువును నేక విధంబున నాదరించినన్,
ఫలము పరస్పరంబు గడు వ్యత్యయమై యుదయించు; నొక్క చేః
సలిలముఁ బోసి నింబము రసాలముఁ బాదునఁ బ్రీతిఁ బెంచినన్,
హాలహలతుల్య మొక్కఁ డమృతాభ మొకండును గావె? మిత్రుఁడా. 20

చ. ప్రణుతనిజప్రసిద్ధగుణరంజితలోకుఁడ యేని, వానికే
వల మొకపూఁటె చాలు; నిల భ్రష్టుఁడు దాఁ దడ వున్న నష్ట మె
ట్లనఁ, బులకండ మున్న నిమిషార్థము చాల దె నోరఁ? బెద్ద ని
ల్చినఁ బెనుబొమ్మరాయి, పలుఁ జేటగు నేమిఫలంబు; మిత్రుఁడా. 21

ఉ. ధారుణి నేఁడు భాషలు యథార్థము నమ్రము పొట్టకోస మే;
గౌరవ మింత కోరినను గానలెఁ డా గుణవంతుఁ డె ట్లనం,
గీరముపచ్చ చెక్కలును గెంపు మొగంబును గంఠమాల యుం
జారుతరోక్తులుం, జెలువుం సంకెల పాపు నటయ్య? మిత్రుఁడా. 22

చ. పరిమితి లే కయోగ్యులను, స్వల్పతమంబుగ యోగ్యుల, న్వసుం
ధర సృజియించుఁగాక విధి, ధర్మవు సేయఁగ రాదె యాయెడం
దరయ గులాబిచెట్టునను దాపదమస్తక ముండె కంటకో
త్కరములు నేల రాలవుగదా? మఱి పువ్వులఁ జూచుం; మిత్రుఁడా.

చ. కలిగినసద్గుణంబు లధికంబు లగున్ సుమనోగణంబునం
దల పలుగాకులందు నుదయం బయినం, దుద ముట్ట నిల్చునే?
పొలుపుగఁ జాతిపుష్పములఁ బుష్పరసాదులు వృద్ధిఁ బొంది మే
ల్ఫలము లగున్; జిగుళ్ళమృదుత్వము రక్తిమ పోవె? మిత్రుఁడా. 24

చ. తనసుగుణంబె యొక్కనికి ధారిణి గిట్టక యుండ వచ్చు; న
ట్లని యది యుజ్జగింప నగునా? జగ మాతనితోన యున్నదే?
కనకము గంధమూ న్విడదు గా, యళికిం దల కంటగించినన్?
జనములు దాని నెట్టు శిరసావహియింపక యుందురు? మిత్రుఁడా. 25

చ. అలవడుఁ బ్రాయికంబు గను నందఱ కెగ్గుగ నా లె బాల్యమం;
దలఘుల కవ్వి తగ్గదు ననంతరం; మల్లివ కట్లు గావు; కా
యలు తఱు చన్ని దుష్టరుచు; లైన రసాలశలాటుపుల్పు భూ
స్థలిఁ దఱుఁ గొందుఁ; జింతపులి చచ్చునె? యెన్నఁటి కైన; మిత్రుఁడా.

ఉ. శూళితసాన భూజనులకుం బగతుం డగునట్టిమూర్ఖు, కో
న్నాళుల కట్టె మాఱి, సుమనఃప్రియవర్తి రసజ్ఞుఁ డయ్యెడుం;
గాలము చేత మాఱనిది గల్గు నె? గొంగళిపుర్వు పిమ్మటన్
మే లగు సాకుఁజిల్క యయి మెచ్చొనరించుట లేదె? మిత్రుఁడా. 27

## శ్రద్ధ.

చ. సదమలబుద్ధిమంతులును, శ్రద్ధ వహింపక యున్న, లేశమున్
జడు వయిన న్మతే దయినఁ, జక్కఁ ధరింపఁగ లేరు నెమ్మదిన్;
విదితము, నిగ్గుటద్దములు వెక్కుఁ గళాయిని బూన కున్న, నొ
ప్పిదముగఁ దాల్చునయ్య ప్రతిబింబములం? బరికింపు మిత్రుఁడా. 28
చ. అమలినచిత్తుఁడుం జలితుఁడైన గ్రహింపఁగ లేఁడు సూక్ష్మ స
త్త్యముఁ; జలితుండు గామి నొకదారి యథార్థ మెఱుంగు మందుఁడున్;
విమలజలంబులం గలితవీచుల బింబము భిన్నరూప మౌఁ;
గ్రమముగ మడ్డినీట నది గన్పడు నిశ్చలమంచు; మిత్రుఁడా. 29
ఉ. ఆతతసంశయంబు హృదయంబునఁ గల్గ, సముత్తరంబులన్
వీతకలంకుఁడౌ సుమతి వేగ మెఱింగి; జడుండు కాఁడు గా?
శాతనఖాంకురంబులను జల్లఁగ గోఁకినఁ, గోమలాంగకం
డూతి యడంగు; మస్మ్రగుల నోవఁగ జూఁడినఁ బోనె ? మిత్రుఁడా. 30

## బుద్ధి.

ఉ. అంగబలంబు ధీబలశతాంశముతోడుత నైన సాటి సే
యంగను రాదు; గావున బలాధికుఁ డన్నిట బుద్ధిమంతుఁడే;
యంగుగ ధారిణీశశిబిరాకృతి మగ్గము పన్ని, సాలెపు
ర్వంగదఁ దేలుఁ బట్టి జఠరాగ్నిని వేల్చుట లేదె ? మిత్రుఁడా. 31
చ. నిరుపమబుద్ధి దైవ మిడ, నీచుఁడు దుర్విషయంబులం బోరిం
బోరిఁ గని పెట్టుటం దహితముల్ పొనరించుటయందుఁ జూపెడున్;
వెరవుల నందె వేసినది. ఫేరవ మేమి ఫలంబు? దానినే
ర్పరితన మెల్ల, వంచన శవగ్రహణంబునఁ గాదె? మిత్రుఁడా, 32
ఉ. అంగము వోలె బుద్ధి యును బ్రాణుల కాత్మకులోచితంబ కా
నం గను వచ్చుఁ; గారణగుణంబులు కార్యమునందుఁ బట్టవే?

సింగపుఁబిల్ల గంధవనసింధురకుంభముఁ జీల్ప నేరుఁ; బీ
నుంగుల వేఁట లాడను జనుం గద జంబుకజంబు? మిత్రుఁడా. 33

ఉ. ఎందుఁ బ్రవేశపెట్టిన నహీనత నందె యొసంగుఁ; గానఁ దాఁ
బొంగుగ మంచికార్యముల బుద్ధిని జొన్ప వలెన్ వివేకియై;
మందిరమందుఁ గ్రిమ్మనణమమ్మ నడంపఁగఁ జాలుదీపమున్
మదశఁ జారులో నిడఁ, బ్రమాదము సేయక యున్నె? మిత్రుఁడా.

చ. అనయము వన్నె మీఱును వ్యయం బగుకొద్దిని బుద్ధి; కందుచేఁ
గనఁబడు మత్తరోత్తరపుఁ గార్యములందు మెఱుంగు లెల్లనన్,
కనకమునన్ గుణంబు లధికంబులు గావె పుటంబు వెట్టినన్,
గనుకనె మేల్మిబంగరునగల్ వెల హెచ్చు గరంబు; మిత్రుఁడా. 35

ఉ. చక్కఁగ దాఁగి యున్నవి ప్రశస్తపుటూహలు బుద్ధిలో నిజం;
బెక్కుఱ గల్గి మానక ప్రయత్నము చేసినచో బయల్పడున్;
నెక్కొని యుండ లేదె నవనీతపుముద్దలు పెర్వులోపలన్?
దక్కక వేఱె కవ్వమునఁ ద్రిచ్చి గ్రహింపదె వాని? మిత్రుఁడా. 36

చ. కవికిని శిల్పికిం గలము కైకొని వ్రాయుచు నున్న నూరెకున్
నవనవచిత్రకల్పనలు; నమ్ముము మానిన నూర కుండు; నూ
రువులను గూర్చుచుండి కొమరుం దొగిఁ జూచుక యూను చున్న, వె
ల్లువ లగుచుండుఁ జాలుఁగ లోన నె యింక వె యన్వి? మిత్రుఁడా 37

చ. పొడమినయట్ల యుంచినను బుద్ధికిఁ దేజము గల్గ దెప్పుడున్;
విడువక వేదశాస్త్రముఖవిద్యల రాపిడి పెట్టఁగా వలెన్;
బుడమిని మాలజాల్ మొదల బొగ్గులకున్ సరి యౌచు నుండ వే?
కడు నవి శాణఘృష్టములు గాక వెలింగెడు నయ్యా? మిత్రుఁడా. 38

ఉ. పుట్టువుతోడనే గలుగు బుద్ధి యొకించుక యెల్లవారికిన్;
బట్టుగ దాని వృద్ధి పఱుప న్వలె విద్యఁ గ్రమక్రమంబునన్;

బట్టికి ముందు పాలవల వంటక మానవలఁ బండ్లు భక్ష్యముల్
బెట్టక యున్న నెట్లతఁడు పెద్ద యగుం? బరికింపు మిత్రుఁడా.
ఉ. పెద్దయుఁ జిన్న యంచు నొకభేదము లేక సమస్త సంగతుల్
బుద్ధి గ్రహింపఁ జాలుఁ జుమి పోఁడిమి గా; వని యొప్పు లన్న చోఁ;
నద్దము, పర్వతంబు పరమాణు వటంచును జూడ కన్నిటిం
దద్దయుఁ దాల్చు నుండ నిరతంబును జూచుట లేదె? మిత్రుఁడా.

---

## కాలము

ఉ. కాలముగుస్వభావమును గాంచి వివేకము గల్గునాతఁ డే
వేళను జాగరూకుఁ డగు; వెంగలి దానిఁ గనం దృణంబు నం
బోలెను; బశ్యతోహరుని భూరిధనాఢ్యుఁడు గాచి యుంచు నె
క్కాలము; వానిలక్ష్య మిల గర్భదరిద్రున కేల? మిత్రుఁడా.
ఉ. కాలము పెద్ద యుండఁగనె గల్గుపనుల్ నెఱవేర్ప లెస్స; త
త్కాలముమీఁద నమ్మకము గల్గుట, డాయఁ గడంగు టొప్పునే?
నాలుగువస్తువుల్ గృహమునం బెనుదీపము వెల్గు చుండ నే
మే లగుఁ జక్కఁ బెట్టుకొన; మీఁదను విఘ్నము లెన్ని? మిత్రుఁడా.
ఉ. మేలును గీడు నెయ్యెడను మేదినిఁ బ్రాణులు పొందు చుంటకుం
గాలమె మూలమంచు నెఱుఁగ న్వలె మానవుఁ డాత్మలోపలన్;
హేళిని బూర్వపర్వతము నెక్కఁగఁ జేయుఁ బ్రభాత; మాతనిం
గూలుచుఁ గాంతి సర్వమును గోల్పడఁ గంధిని మాప; మిత్రుఁడా.
ఉ. కాలుఁడు సర్వకాలమును గాలము నైచుక కాచి యుండ, నే
కాలమునందొ చిక్కుడును గాక, తొలంగెడు జంతు వున్నదే?
నేలను రాల కుండ ధరణీజమునందున యెల్లకాలమున్
వ్రేలుచు నాకు లుండఁగలవే యొకకొన్నియు నైన? మిత్రుఁడా.

క. బాలుఁడు వృద్ధుఁ డొక్కగతి భాసిలు చుండెద; రైన వారికిం
గాలము వృద్ధియున్ క్షయముఁ గల్గఁగఁ జేయు ననుక్షణం బదే
చా లనఁ, బూర్ణిమాదివససంఖ్యను బ్రాచిఁ బ్రతీచిఁ, జంద్రుఁడున్
హేళియు నొక్కమాదిరి గ్రహించెద; రేమగు మీఁద? మిత్రుఁడా. 45

-. ఎట్టి యుపద్రవంబు ఘటియిల్లిన నాయువు వొకించుకంత దా
గట్టిగ నుండినం బ్రతుకు గాంతురు కాలము సెల్లువారలే;
యి ట్టటు పెద్దపెద్దదృఢవృక్షము లూఁగఁగఁ గాలి యున్నఁ
గొట్టినఁ, బండుటాకులును గొన్నిల రాలవు గాదె? మిత్రుఁడా. 46

---

## ఉద్యోగము

. అవనిని సత్ఫలంబులు మహత్తరకష్టసమావృతంబులై
యవుటను జేసి వాని కెదయందును జంకిన లాభ మబ్బునే?
మొవలిని జుట్టుకొన్న చెడుముండ్లకుఁ బాములకున్ భయం పడం,
బువులను గోసి తెచ్చుకొనఁ బోలునె యెవ్వారికైన? మిత్రుఁడా. 47

. పలుదెఱఁ గౌ నదృష్ట; మది పాటును బట్టి ఫలించు: రెంటిలో
వలను నదృష్ట మెంచ బలవత్తరం; మెట్టు లనంగ, విత్తనం
బులు వివిధంబు; లవ్వి గొని భూమిని జల్లక పండ; వైనఁ ద
త్ఫలములు బీజధర్మమును దాఁటునె యత్నముచేత? మిత్రుఁడా. 48

. కడఁగక శక్తుఁడుం జిఱుతకర్జము దీర్పఁగ లేఁ; డశక్తుఁడున్
విడువక యాచరించి నెఱవేఱుచుఁ దా ఘనకార్యమైన; నొ
క్కఁడు గెఁడు పోవ నేరదు మహాజగరంబు నిజస్థలంబునం
దుడుగక యుంటఁ; జీమ పొరుగూరికి నేగిన నేగు? మిత్రుఁడా. 49

. సారము గల్గుదానికయి చాల శ్రమం పడఁ జెల్లుఁ; గాని ని
స్సారపుదానికై పడిన, సర్వము వమ్మగు; స్వాదునీరసం

పూరితనారికేళఫలముం బగిలించిన డప్పి దీఱు; నే
దారిని నేద దే తెఱకును దయ్యపుఁదట్టు వగల్ప? మిత్రుఁడా.

చ. చెలువుగ నొక్క కార్యమును జేయుట కుండు ననేకమార్గముల్;
దెలివి నందు యోగ్యమును దేలిక యైనది చేకొన న్వలెన్;
గలుగవె యూపిరి న్విడువఁగా మొగమందును నోరు ముక్కురం
బులు? నయినన్ సమస్తజనముల్ ముకుదానె పుచ్చు; మిత్రుఁడా.

చ. నుడివెద, మంత్రిగుప్తములును బటుసారము లైనకార్యముల్
చెడ; నటు గాక యుండినను జేటు ఘటిల్లుట సిద్ధమే సుమీ;
ముడివి పొలాన విత్తినను మూఁడవనాఁటికి మొల్చు బీజముల్
పుడమిని; త్రోట దంచినవి, పొల్లులు మొల్చునటయ్య? మిత్రుఁడా.

చ. ప్రతిదియు నాదిఁ గష్టతమభంగిన యుండును; జేయఁ జేయఁ, గ
ష్టతరముఁ గష్టమున్ మఱవు శక్యము సౌఖ్యకరంబు నయ్యెడిన్;
క్షితి నడయాడ నేర్చుటకుఁ జిన్నతనంబున బిడ్డ లేచుచుం
బతనము నొందుచుం దుదకుఁ బర్వులు వెట్టును గాదె? మిత్రుఁడా.

ఉ. తా నెఱవేర్పఁ బూనుపని, తగ్గగతిం జినచిన్నభాగముల్
గా నొనరించి, యంతపయిఁ గ న్నడ కోలి నొనర్పఁ జాల్కునా;
మానము లెన్నొ యుంటఁ, గను మాటుచు నేండ్లకు నేండ్లు చక్రగు
పాన నిలుక్కునఁ దిరిగి నచ్చు నెఱుంగక యుండ; మిత్రుఁడా.

చ. పని పదియాఱుపాళ్ళ నొకపాలవశిష్టము పెట్టి, వెన్కఁ జే
సినది వృథాప్రయాస; మది చేయకపోయిన మోద మబ్బు; దె
ట్లన, మణిసౌధడోలికను హాయిగ నిద్దుర వోవ నెక్కి, ని
చ్చెనతుదిమెట్టు దాఁటఁ బస చెడ్డను నేమి ఫలంబు? మిత్రుఁడా.

ఉ. లోకము మేలు గోరి విమలుల్ ఘనకార్యము లాచరింప, న
స్తోకము లైనవిఘ్నములు దోఁచును వారల; కైన నోర్వరే?
లోకహితుండు జంతువులకున్ మధురోదక మీయ వెల్గ, మే
ఘాకృతు లడ్డ మౌను గిరణాళికి; మాను నె దాన? మిత్రుఁడా.

చ. పనితనము బాటు లేనియెడ భావమునం దెడఁగోరికల్ జనిం
చును; నటుగాక యుండిన విశుద్ధ మగుం జుమి బుద్ధి; యెట్టు నా,
వనిశము బాటసారులు ప్రయాణము చేసెడు దారి శుభ్రమై
కనఁబడు; మాఱు దారి ములుకంపలు మొల్చును గాదె? మిత్రుఁడా. 57

---

## విద్య

ఉ. కలిమి యొకింత లేకయును గౌరవపాత్రులె సుమ్ము పండితుల్;
కొలఁదికి మీఱు సంపదలఁ గూడియు మూఢులు మాననీయు లే?
యలరవె చూపుగల్గు కను లంజనరేఖ ఘటింప కుండినన్?
కొలుకుల కంటఁ గాటుకను గూర్చిన గ్రుడ్డివి లెస్సె? మిత్రుఁడా. 58

ఉ. విద్దియ లేనివారలె యవిద్య కవారసు లౌనగారముల్;
మద్దుగ నెంతనిద్దినను మూఢులయాననముల్ శ్మశానముల్;
కొద్దియు వెల్గు లేనిమనుజుల్ పెనుఁజీఁకటి కున్కు; లెంత మే
లద్దపు మేడ లైనఁ గన నర్హమె దీపము లేమి? మిత్రుఁడా. 59

ఉ. ధనికుఁడు కొంతమందికి ముదంబిడఁ గల్గును సత్త మెంచుచున్;
ఘనకవి యైనఁ దాఁ గొఱఁత గాంచక యెల్లర వాళిఁ దేల్చెడున్?
కనఁబడి నీరసం బగుచుఁ ద్రెళ్ళును బెంటలమీఁద నించు; గ
మ్మనువకుళప్రసూనసర మవ్విధ మయ్యెడు నయ్య? మిత్రుఁడా. 60

ఉ. తోడెము విద్య నేరువమి దుర్లభ మా సరసత్వ; మందఱున్
నాఁడెము నూ పఠింప; సుగుణంబులు గొప్పకులం బొసంగు నే?
గాడిదచేతియల్ మగల గట్టిగ ముట్టెలఁ ధన్నుఁ; బోవ నీ;
గోడిగ లైన నేర్చి మగగుఱ్ఱముఁ దన్నక యున్నె? మిత్రుఁడా. 61

ఉ. తమను స్వరూపమాత్రఫలజన్మలఁ జూడకు వారియున్కి లో
కమున నెఱుంగ లేరు; కనఁ గాంచక యే తెలియంగ నౌ; మనో

గమనము మనోలతాగవిహారం బగు కేళివనంబులౌఁ, బలా
శనాలవిలాసముల్ జనులస సదయుం గుటి కానె? మిత్రుఁడా. 62

చ. మగువ మగండు, విద్యను గ్రమంబుగ నేర్చినవారె యైనచో,
సొగసుగ నుండు; నం దొకరు మంతగ నున్న నసహ్యమే సుమీ;
మొగమునఁ గన్నదోయి యిరుమూల సదృగ్విభవంబు పూన, బా
గుగ నుపయుక్త; మం దొకటి గ్రుడ్డిది యైన న దెట్లు? మిత్రుఁడా. 63

చ. సరసత లేనిమూర్ఖునివచశ్శ్రుతి మైనను గాదు గాని, బా
హ్యరరసికుండు పల్కునొకవాక్కయినన్, సుజనప్రమోది యౌ;
ఖర ఘురవాయి లే కఱచఁగా బరితోషము నొంద రుండి. కం
ధర ముఱుమ న్మయూరములు నాట్యము సేయఁగదయ్య, మిత్రుఁడా

ఉ. తల్లుల మంచ మెంచి తముదారు లె నేరిపి శైశవంబునం
బిల్లలఁ బాడు సేయుదురు బిడ్డ నెఱుంగని మొద్దుముద్దియల్;
పిల్లులు కన్నలే విడనిపిల్లల నిల్లిలు ద్రిప్పి, వానికిన్
బల్లులఁ దెచ్చి ముం దునిచి బాధ యొనర్చుట నేర్పు; మిత్రుఁడా.

ఉ. పిన్నయుఁ బెద్ద యన్న యనుభేద మ దేటికి? బుద్ధిశాలి యౌ
చిన్నయె పెద్ద; పెద్ద యనఁ జెల్లునె వృద్ధుని నెద్దుమొద్దు? దీ
పోన్నతిఁ జీకువాల్ చెఱుప నోవును సన్నపువత్తి; రిత్త యై
యున్నను దివ్వెకంబ మిరు లార్చునె? కాళ్లకు నడ్డు; మిత్రుఁడా.

ఉ. ధారుణి నెల్లవారలకు దైవము వేఱుగ శక్తు లిచ్చెఁ; దా
నేరువ వల్ల కానివి యనేకము లున్నవి విద్య, లెట్లనన్,
సారెల వేళ్లు లుంచి పరసంబుగ వల్లకి మీటుఁ గాక, యే
దారిని గార్దభస్వరుఁడు దా బయకాఁ డగువాఁడు; మిత్రుఁడా.

చ. గురువు వినాఁగఁ దాఁ జదువుకొంట భరం బగుఁ దొల్తఁ; బిమ్మటన్
గర మును నాస్థ పట్టుదల గల్గి పఠించిన నొజ్జ మీఱెడున్;

స్వైరవృత్తిఁ దాళము నొమ్మదలు నిల్వఁడు నిచ్చెన నెక్కి సెట్టిగాఁ
దరుగఁడె మొవ్వటాకు గదియన్ గుదిబల్లులు పూని? మిత్రుఁడా 68.

మననము సేయ కుండినను మాయును మానసమందుఁ బట్టినన్;
దినమును నూనినం జెడును దిన్నగఁ బట్టక పూర్వ మేదియున్;
బోనరఁగ వృద్ధి యా జలము పోఁతను మానినఁ బెద్దవృక్షముల్;
చినచిన మొక్కలట్టు లెడ జేసినఁ జచ్చును గాదె? మిత్రుఁడా. 69.

ఎచట నొ యొక్కచోటఁ జదివింప వలెన్ గడి గట్టి; నట్టు కా
కచటిచ టంచుఁ ద్రిప్పినను సస్యము, విద్దియ వృద్ధిఁ బొందునే?
యుచితపు నేల నాటి యట నుండఁగ నిచ్చిన, వేరు పెట్టి మో
సు చిగురు పట్టుఁ; బూఁట కొకచోటను నాటినఁ బోదె? మిత్రుఁడా

పేరికిఁ బెక్కువిద్యలను వ్రేలటు పెట్టుటకంటె నేది యే
నారసి యొక్క విద్యను నిరంకుశపాండితిఁ గాంచ మేలు; కాం
తారమునందు నాకసమునన్, మృగపక్షులు పత్త్రతతిసం
చార మొనర్చు స్వేచ్ఛ మెయి; స్వస్థత కోళ్ళకు నేది? మిత్రుఁడా.

అరయఁగ బాల్యయౌవనము లంగును, సోమరులౌచుఁ గాలముం
జరిపినమానవుల్, గడపఁ జాలక యేడ్తు రనంతరార్తులన్;
దొరువరి, ప్రొద్దు కల్గఁగనె తిన్ననియాహారను జేరుకోనిచో,
నిరు లయదేర, దారి నతఁడేమి యొనర్పఁ గలండు? మిత్రుఁడా. 72.

సురుచిరభావకల్పనల శోభిలుపుస్తకలక్ష లొక్కయ
క్షరమును దప్ప కుండ, పరుసం బఠియింపఁగఁ జాలినన్, వృథా
వెరవిఁడికిన్; విచిత్ర మగువిశ్వ మజస్రముఁ జూచుచుం బహూ
త్కరములు, లాభముం గనునె దాన నొకించుక యైన? మిత్రుఁడా, 73.

పంతుల మంచుఁ గ్రించులు, స్వపాండితి నన్యులతప్పు దిద్దఁ జూ
పింతు; రయో! స్వపక్షమున కేమి యఁ దద్వినియోగ ముండ; ద

శ్రాంతముఁ జుట్టుఁబట్టకె నిజప్రభ నిచ్చును దివ్వెకంబముల్;
ధ్వాంతము తమ్ముఁ గ్రమ్ముకొన దాని దలంప వదేమొ? మిత్రుఁడా.

ఉ. పండితుఁ డైనవాని కొకపట్టునఁ జుల్కఁదనంబు గల్గియే
యుండును గాక, య ట్లనుచు నొండులతో సరి సేయఁ దప్పు గా
కుండు నె? బ్రహ్మజాతి యగునుజ్జ్వలవజ్రము నీటఁ దేలినన్,
బెండునకున్ సమాన మని పేర్కొన రాదు గదయ్య; మిత్రుఁడా.

చ. చెడుగుణ ముండినం, జదువుచేతను గల్గుప్రకాశ మంత చొ
ప్పడ; దది వీడినం బురుషుఁ బొందితి సర్వతమోహరం బగున్;
గొడి గలదీపముల్ మిగులఁ గున్కుచుఁ దేజము దక్కి యుండెడుం;
జెడ నవి కత్తిరించినను, జీఁకటి బొత్తిగ మాపు; మిత్రుఁడా.

చ. ఒకరికి వచ్చి పోవు ననునోర్వమిచేఁ, దన నేర్చుదాని నే
యొకరికిఁ జెప్పఁ డేనిఁ దన కున్నది పాడగుఁ; జెప్ప మేలగున్,
సకలజనంబుఁ దోఁడుకొన సమ్మతి చేసిన నూతిలోనినీ
ళ్ళకుఁ గొద వేమి? లాఁతిసలిలంబులు పాడగుఁ గాని; మిత్రుఁడా.

కు. చదివినవార లెప్పుడును సఖ్య మొనర్చెద రెల్లవారితోఁ;
గదన మొనర్తు రెల్లపు డకారణ మజ్ఞజనుల్ స్వజాతితోఁ;
ముటమునఁ గీరశారికలు ముచ్చట లాడుఁ బరస్పరంబు; దు
ర్మదమున వానిలో నవియె మార్కొని కుక్కలు పోరు; మిత్రుఁడా.

చ. చదురున నేగు రజ్ఞులు ప్రసంగము సేయుచుఁ గూరుచున్నఁ, గో
విదుఁ డొకఁ డున్నయందమున వేయవపాలనా రాదు చూడుమీ;
వదరుచుఁ జూతవృక్షమున వాయసముల్ పదివేలు మూఁగినన్,
గదురునె పంచమస్వరపికం బొకఁ డుండినశోభ? మిత్రుఁడా.

చ. సదనమున నెవ్విధంబునను సభ్యు లసభ్యులు గూరుచున్నఁ, ద
ద్వదనబహిర్గతంబు లగువాక్యము లే యెఱిఁగింపు వారలన్;

హ్రదమునఁ బెద్దబాతులు మరాళము లట్టిటు నీఁదుచున్నచో,
మృదుకలనిక్వణంబున గ్రహింపరొకో కలహంస? మిత్రుఁడా. 80

---

## విమర్శనము

తప్పును నొప్పు భ్రాంతిమయి దాము గ్రహింపఁబడు న్విరుద్ధపుం
జొప్పున; నైన నిక్కువము సూరిజనంబు లెఱింగి చెప్పరే?
యొప్పని తంచదార, మధుగోస్తనిశర్కర యంచు నుప్పు, నై,
తప్పునఁ జేకొనన్, నిజము తప్పక చెప్పదె నాల్క? మిత్రుఁడా. 81

ఈనుము గోస మాది యగునిట్టిగ్రానుగొనంబు లున్న, నెం
తేసిరసజ్ఞు లర్థము గ్రహింతురు గా, విపరీతరీతి గా!
మీసర మైన పైత్యమున, మెం డగునుష్ణము, నివ్వ యాది యౌ
దోసము లున్నఁ, నాలుకకుఁ దోఁపదె చేఁదుగఁ దీపి? మిత్రుఁడా. 82

వాగెడువాని నే పరమపండితుఁ గాఁ దలపోయు మూఢుఁ; డా
లాగునఁ గాక వారలకొలందు లెఱుంగు వివేకి; గంటనా
దౌగడియార మే ఘన మటంచును జానపదుండు చూచెడున్;
జేగడియారమున్ ఘనము సేయఁడె నాగరకుండు? మిత్రుఁడా. 83

నవరసభవ్యకావ్యమునుగుణంబును జక్క గ్రహించి శ్లాఘనం
గవి నొనరింపఁ బండితుఁడు గా కొకపామరుఁ డే మెఱింగెడిన్?
నవసుమభిప్రఫుల్లనలినంబునురందము గ్రోలి ఝుంకృతిం
దపిలి యొనర్చు షట్పదము దక్క సమర్థమె దోమ? మిత్రుఁడా. 84

పేరును రూపుఁ గాంచి యొక పేరిని బెట్టఁగ రాదు; వస్తుహృ
త్సార మెఱింగి యిట్టి దని తెల్ప నగున్; ఫలసంజ్ఞ నొందినం,
దోరపుఁబుష్య లుండెను నుదుంబరమం బరికింప; సుందరా
కారతఁ దోఁచినన్, ముసిఁడిగర్భము చేఁదగుఁ గాదె? మిత్రుఁడా. 85

చ. సరసము నీరసంబు నొకచందముగాఁ బయి కుండ వచ్చు; లో
నరసిన హెచ్చు తగ్గు తెలియంబడ కుండదు సుమ్ము యెప్పుడున్;
ధరణి రసాలదండమువిధంబున నుండదె చొప్పకట్టి? పైఁ
బరఁగిన పేడు దీసి తిన, బైటఁ బడుం బస యెల్ల; మిత్రుఁడా.

చ. అరసిన నెట్టిసత్కృతికి నైనను దోషము లుండ కుండు నే?
వెరసిని దాల్ప మంజులత, విజ్ఞులశ్లాఘకు భాజనం బగున్;
బరుసము లొచ్చు నప్ప నగుపర్వము లుండవె పుండ్రమందు? ని
ద్ధర నొకఁడుం గనంబడునె దానిని మెచ్చనివాఁడు? మిత్రుఁడా.

చ. ఇతరులస్వల్పదోషముల నేని యెఱుంగఁగఁ జాలునట్టిపం
డితుఁ డయినం గ్రహించుకొన నేరఁడు పో తనగొప్పతప్పు; వి
శ్రుత మిది; లాఁతికంటిపువుఁ జూడఁగఁ జాలినలోచనంబుద
క్షత, తనలోపలం బొడముకాయఁ గనుంగొన నేది? మిత్రుఁడా.

ఉ. మానుషు జేత నౌ ననెడుమానును లెందఱొ యుందు; రైన న
య్యాకృతి కర్తఁ డెవ్వఁడొ యనన్వఁ డెవండొ పరీక్షఁ దేలెదున్;
వేకువ మేలుకొల్పఁ గలకీ కరటంబులుఁ గోళ్లు; నైన నం
గాకము చంద్రికాశరదకాంతిని భ్రాంతము గాదె? మిత్రుఁడా.

ఉ. చేరువ కేగ కుండినను ఛిద్రము లేమియుఁ గానిపింప వె
న్నారల కైన, డాసిన నపారము గా నవి లేక యుండు నే?
దూరమునుండి చూచినను దోఁచును గుట్టలు కోట వెట్టిన
ట్లూరక నన్న గా: నటుల యుండదు నె నగ్గఁబోవ? మిత్రుఁడా.

ఉ. ప్రేముడి పాదుకొన్నఁ గనిపింపవు దోషము లెన్ని యుండినన్;
దామస మున్న నొప్పులును దప్పులు గాఁ గనిపించు నన్ని యున్;
దామర, దుస్సహాతపముతైక్ష్ణ్యము మెచ్చి, పొగడ్త సేయు నే
మోములఁ; జంద్రికారుచికి మూతి ముడుంచుక యుండు; మిత్రుఁడా

ఉ. పంకములోనఁ ద్రోయుఘనపాపజగంబున దేహయాత్ర ని
శ్శంకతఁ జేయ, నొప్ప గనఁ జాలరు లోకులు; దోషదృక్కులే;

జంకక జాఱు నేల పడఁ జాలిన నేర్పును మెచ్చ రెవ్వ; రె
వ్వంకను గాని కూలఁబడ వాని హసింతురు గాని; మిత్రుఁడా. 92

ఉ. గుణము దొఱంగి దోషమునకుం దడవుం గుటిలుండు; దోసముల్
గణనము సేయకే సుగుణకాండముకై సుహృదుండు డాయు; ధా
రుణిఁ గమలాకరంబునను రోయక పత్త్రల నేఱుఁ గొక్కెరల్;
ప్రణుతమృణాళనాళము మరాళ మెఱింగి మెసంగు; మిత్రుఁడా. 93

ఉ. సరసపదార్థమందును బొసంగును దప్పులు; వెఱ్ఱివాఁ డవే
తొరగ గ్రహించి చూపు; సుహృదుం డవి లోఁగొని యొప్పు దేల్చు; శ
ర్కరపాడిపానకాన నిసుకల్ చొరవే? వడపోఁతపాఁత వే
గిర మవి పట్టి తెల్పఱుచు; గిన్నియ చేయునె యట్లు? మిత్రుఁడా. 94

ఉ. వంకర లెంతురే నవనవస్ఫుటసత్కృతి, కింకఁ దన్నిరా
తంకసమృద్ధిచే ముదము, తగ్గిన ఖేదము, గందురు గాక? యే
ణాంకుని శుద్ధమండలము విదియన్ బుధవర్గము వెక్కిరించునే,
పొంకము మీఱఁ జొక్కడును, బొల్పఱ నుక్కును గాని? మిత్రుఁడా.

## హితోపదేశము

ఉ. కూళల దిద్ద, వారలకుఁ గోపము వచ్చును; గాని లేశమున్
మే లొనగూడఁ బోదు; పయి మిక్కిలి బోధకు బాధ లొందెడున్
వైళము; కుక్కతోఁకకును వంకర తీర్పఁగఁ బూనఁ దీఱునే,
కా లది తత్క్షణం బొడిసి కట్టిగఁ బీఁకును గాని? మిత్రుఁడా. 96

ఉ. మందున కైనఁ దెల్వి గలమానిసికిం దెలుపంగ వచ్చుఁ; గా
కెందును సారలేశపరిహీనునకుం గఱపంగ శక్యమే?

పొందుగఁ గాష్ఠ మైన నొకపోఁడిమిగా వెలిఁగింప వచ్చుఁ; గా
కెందును వట్టిబొగ్గు వెలిఁగింప నసాధ్యము గాదె? మిత్రుఁడా. 97

చ. పరుసని సామవాక్యములఁ జక్క నొనర్పఁగ వచ్చుఁ; గాని దు
ష్కర మగు ముష్కరుం గలితసాంత్వనపద్ధతిఁ జక్కఁ జేయఁగాఁ;
గరసరసీరుహాంబువుల గ్రిక్కిన వేత్రముఁ దిన్నఁ జేయ నోఁ
ద్వరితము; వంటకట్టెయల వంకర పోవ్రి యియ్యెడఁ దీఱు; మిత్రుఁడా. 98

చ. కటువుల మందలించినను గన్నుల నీ ళ్విడుచున్ సుశీలుఁడా;
నటువలె మొండి, వాని కిసుమంతయు లోఁగక రెచ్చు; నెట్లనన్,
జోటఁజోలు నీటిబొట్టురల నొచ్చుచు జివ్వన లాగుఁ బండ్లు, మె
కుక్కట నలపుల్లగాయలను; గొంకునె వానికిఁ గత్తి? మిత్రుఁడా. 99

చ. అలుక జనించి యార్చి యెవఁడైన నలంతుల బూకరించినం,
గలిగినతప్పు పోగు; తనకంటెను దిట్టలయొద్ద నేమి యౌ?
నిలువక కట్ట కొక్కయెడ నీళులు కన్నము వెట్టి పాఱుచుం,
బులుఁ బడగెంటుఁ; గా కుపలపుంజము నేమి యొనర్చు? మిత్రుఁడా. 100

చ. భ్రమయుఁ బిమాదను న్నరులఁ బాయునె? పండితుఁడైన నేమి? దో
స మెవరు దిద్దినన్ సరియొ, సంతస మొందుట మే; లదెట్లు నా,
నమలము లైనయద్దములయందును డాగులు గానె? సీమను
న్నముఁ గుమవగ నిచ్చిన ఘనం బగుఁ గా తనుకాంతి? మిత్రుఁడా. 101

---

## వివేకము

చ. చపలమనంబు నీచ మగుజాడలఁ బోక నిసర్గమే; వివే
కపటిమచేత దాని నెటు కావలె నట్లొనరింప వచ్చు; నీ

రిపుఁడును బాముఁ బల్లమున కే గద? యైనను యంత్రసేతుము
ఖ్యపరమసాధనాళి యది కా దెటు కొనినరీతి? మిత్రుఁడా. 102

ఇట్టటు దుర్మదేంద్రియము లీడువఁ నీడిచినట్టు లెల్లఁ దా
నెట్టనఁ బోవు హాని యని నిక్క మెఱింగియు మూర్ఖుఁ; డే ట్లనన్,
వెట్టగ మంటు సోఁకిన వివేకము దెచ్చిక మళ్ళి పోవు నే
బిట్టుగ దానిలో మిడుత వే పడి మగ్గును గాని? మిత్రుఁడా. 103

మందులు మంచు వచ్చువిషమంబుల దారయ కప్పు డాత్మ కా
నందము సేయుకర్జము లొనర్చెద రింద్రియకృష్యమాణు లై;
కందనిపచ్చలేఁబయిరు కన్నులపండువు సేయ, డెంద మిం
పొందఁగ మేయఁ బోయి కరు లోదములోఁ బడుఁ గాదె? మిత్రుఁడా.

---

## సంభాషణము

ఒకరి మనుష్యయోగ్యత యయోగ్యత యుండు గ మాటఁబట్టి యే
గనుఁగొను చుండ్రు లోకు; లటు గావున సొంపుగఁ బల్కఁగా వలెన్;
బవఁటుల నోటిపల్కు వినఁబడ్డను నవ్వులఁ దోఁచి వైచి, టం
గున వినఁబడ్డనో విలువ గొందురు గా వెల యిచ్చి? మిత్రుఁడా. 105

ఇలఁ గలయెల్లదోషముల కిక్క యసత్యము; గాన దోసకా
ములకది యిమ్ము; సత్కృతిపరుల్ బుధు లుల్కుచు నుండ్రు దానికిన్;
జెలఁగ రె చిమ్మచీఁకటికిఁ జిత్తమునం గడు జారచోరము
ఖ్యులు? వెలుఁ గన్న సంతసము నొందరె యుత్తము లెల్ల? మిత్రుఁడా.

ఘనత యును నాభిజాత్యము ను గవ్వకు నుం గొఱ గావు, మాటలోఁ
గపటక నొకింతదబ్బఱ యొకండు గనుంగొనె నేని; కీడగున్;

విను, తనయుండ్రు గిట్రియున్, వెండియు గిండియుఁ జూచి రూప్యమున్
జనములు గొందు రే? పలుకు జబ్బయినం దునియింతురు; మిత్రుఁడా.

చ. ఇలపయి వాడి తప్పునతఁ డెంతఘనుండయినన్ సహింబడున్
నిలుకడ లేనివాఁ డనుచు నిక్కము యోజనఁ జేసి పల్కు మేల్;
జలదము మందువెక్కులు విచారము సేయుట మాని మందుగా
బడబడ లాడుఁ; గావున నె పాటి యొనర్పరు దాని; మిత్రుఁడా. 108

చ. కొలఁదికి మీఱుదంభములు గొట్టెడువాంఛికు విశ్వసించుటే
కలుగదు; గల్గునో, యవిటి గా; తుది సందియ మా నిజానకే;
తళుకుఁబసిండిపూఁత పయిఁ దాల్చి వెలింగెడువెండినిన్నియన్
విలిచి సువర్ణబుద్ధిఁ, దుది వెండికె సందియ మొందు; మిత్రుఁడా. 10

చ. ఎసిరిమనంబు నోవ నటు లెంత యు నింపుగఁ బల్కువారలం
బదుగురు గారవింపుదురు; పల్లగులం దఱఁ జేర నిత్తురే?
మొదమునఁ గీరశారికల ముద్దుగఁ బంజరమందు నంచి పెం
చెద; రలకాకులం జెదరఁ జేయ రె చీఁదరఁ జెంది? మిత్రుఁడా 11

చ. సమయ మెఱింగి పల్కువిలసన్మృదువాక్కులు వోలెఁ దీప్రవా
క్యము లొనరింప నేర వొడికంబుగఁ గార్యపుసిద్ధి; నెట్లనం,
బ్రమద మెసంగ రాల్చునె బ్రభాతపుశీతలవాతపోతముల్
సుమఫలముల్; శిలాటువుల డుల్చునె గా పెనుగాలి! మిత్రుఁడా. 11

చ. వ్యపగతమార్దవంబులు మహాప్రియముల్ సమయానుకూల మా
లపితము; లట్లు కాని మృదులంబులు నప్రియముల్ నుడుల్: ప్రభా
తపుఁదఱిఁ గాకకుక్కుటరుతంబు హితం బగు నెంత యున్; వియో
గపుసమయంబునన్ శుకపికస్వర మార్తికరంబు; మిత్రుఁడా. 11

ఉ. ధీరుఁడు జానుగుల్ సాగియఁ దేనియ లొల్కఁగఁ బల్కు మెల్లగాఁ;
జేరినవారికిం జెవులు చిల్లులు వోవఁగ వాడు నీచు; డిం
డీరగసాను కారికలనిక్వణనం బొనరించు వీణియల్;
వీరణముల్ రణంబు నొదవించును దారుణభంగి; మిత్రుఁడా. 1

అన్నము గల్గ మై మఱచి యల్పుఁడు నాలుక పేర్చుఁ; జాలఁగా
నున్నను సజ్జనుండు పరుషోక్తుల నెన్నఁడు దేఁడు నాల్కఁ; కె
ట్లన్న, శ్రవఃకఠోరముగ నార్చును భేకము వానకాఱునన్;
సన్నపుఁగాకలిం బికము సల్పు వసంతమునందు, మిత్రుఁడా. 114

## కొండెము

కొండెము పేరి గుర్గాము గూరిన నాలుక నేర్పుతోడఁ దా
ఖండముఁ జేసికొన్న బ్రతుకం గలఁ డేమొ వరుండు నెయ్యుఁడై;
నిండ్ల విసంబు గ్రక్కుకడు నిక్కుచుకొండిని గత్తిరింప, భూ
మండలి వృశ్చికంబు జనమైత్రికిఁ బాత్రము గాదె? మిత్రుఁడా. 115
కోరికతోడ నొండ్ల చెవిఁ గొండెము లూఁదెడువార నేరిచిం
గూరిమి నేస్తకాండ్రయిన గొబ్బున వీడక మాన; రెట్లనన్,
నారులు చారుకేళిసదనంబున నాథులఁ గూడు వేళ మం
జీరములందుఁ బేరిముడి యొకించుక చూపరు కాదె? మిత్రుఁడా. 116
పిశునునిఁ జేర్చు టెంతయవివేకము? వాఁ డొరు నెట్టు లట్టులే
విశదపడంగఁ జేయుఁ దమవిం బయివారి; కదెట్టు లన్న, నల్
దిశలగవాక్షకాచములు, దెచ్చుఁ బగల్ రవికాంతి లోనికిన్;
నిశల రహఃక్రియల్ గలవె నిల్ప బయల్పడకుండ, మిత్రుఁడా. 117
అన్యుల కెగ్గు సేయుకలహంబుఁ బెంపను మూల మైనపై
శున్యముచేత నెవ్వఁడు వసుంధర నాపదఁ బొందకుండెడున్,
జన్యములోపలం బిగులు చక్కఁగ నొత్తెడువానికుత్తుకన్
దైన్యపడంగఁ గోయ రెటు దల్పక జాలి లవంబు? మిత్రుఁడా. 118

## అతిపరిచయము

చ. పరిచయ మెక్కుడైనఁ బరిభవము నొందు మహానుభావుఁడుం;
బొరయు నుదారగౌరవము బూటకుఁడున్ మితదర్శనంబునన్,
బరిమళసన్మృగీప్రసవపక్వఫలాంచితదైవసృష్టస
త్తరుల నిరాకరించి కొనఁ దల్పరె లోకకృతంబు, మిత్రుఁడా.

చ. మిత మగు కేని యొద్దియును మేదినియందు ననర్ఘ మౌను; గా
కతి యగు కేని యన్నిట ననర్థము యౌను; మితి మీఱ రాదుగా;
వితతతరోష్ణదేశమున వేసఁగిలోఁ బొగ డొందు ప్రాంతరం
చితపవనాభ్రకుం డగడుఁ జెందఁడె శీతునయంగు? మిత్రుఁడా,

ఉ. వాడుక మాటికిం బొరుగువారలయొద్దకుఁ బోవు మన్నఁ, జే
కూడదు గౌరవంబు; తుది గొప్ప పరిభవ మౌ నిజంబుగా;
గాడిదతోఁక కబ్బకులు గట్టుచు నుండరె తాటియాకులన్,
జూడరె యబ్బురంబుగను శుద్ధకురూపిని నొంటె, మిత్రుఁడా.

చ. అభిరుచి యెక్కుడౌ నభినవాగతులం దతిహీనులందె: దు
ర్లభసుగుణాఢ్యులందును బురాతనులం దనురాగ మల్ప మే;
యభిలషితంబు లౌ నపగతార్థము లయ్యును బాలభాష; ల
వ్యభిచరమంజులార్థబుధవాక్యము లంత ప్రియంబె? మిత్రుఁడా.

చ. మనుజున కెంతయేనిఁ జనుమానము గల్గును గాక, తేనిపా
లను గురుపాల, భీతికి దొలంగిన చెయ్యి యొవర్పఁ గూడునే?
మనగృహమందె యున్న దని మూర్ఖతతోడను ముద్దు పెట్టుకో
గనగన వెల్గుదీప మెటు గాలక యుండెడు నయ్యా? మిత్రుఁడా.

ఉ. పోకడ రాకడల్ గలుగఁ బుట్టవు దోషము; లెవ్వి పొత్తిగన్
లేక జనించు నెగ్గు లవలీలగ బంధుసుహృద్గణంబులో;
లోకములోన వారినిధిలోనికి వచ్చుచుఁ బోవు చుంటచేఁ
బాకుడు పట్ట దేళ్ళకును; పాడగు గుంటలనీళ్ళు; మిత్రుఁడా.

## స్నేహము

. చెలిమి సమంబు గా నుభయసీమలఁ బ్రేమము గల్గ లెస్స యౌఁ;
గలుగక యున్న, నొక్కెడన కల్గినన్ విరసం బ యౌను; మ
ర్దళము ధిమింధిమిధ్వనుల శ్రావ్య మగుం, బెను వాఱు రెండు ప్ర
క్కల బిగి యారసున్న; నటు గల్గమి నింపగు నయ్యె? మిత్రుఁడా.

చెలిమిఁ బరస్పరంబు మనఁ జేటు ఘటింపఁగ లేరు శత్రువుల్;
కలహము పుట్టినన్, సులువుగాఁ జెఱుచుం దమలోనివాఁడె; కా
నల నతిసాంద్ర మాతరుగణంబు మహాబలుఁ డుర్విఁ గూల్చునే?
కలఁతల నవ్వి యే యొరయుఁ, గాల్చుఁ దదగ్ని తదాప్తి; మిత్రుఁడా.

వలఁతి కళంతి కేటిసహవాసము? దైవము గూర్చినన్, మదుల్
గొలుపక యేటి కొక్కరుడు, గోటికి నొక్కరుఁ, దీయు చుండ్రు సూ;
వలకయి డాకయిం గలసి వచ్చెడు నే చనువేళ, ముందువె
న్కలకు ను బోవుఁ గా కొకఁడు గానక యుండ నొకండు? మిత్రుఁడా.

చెలిమిని మార్దవంబునను జేసటుఁ జుల్కన గా నభీష్టముల్;
తలఁపఁగ నాగతిన్ జెఱుమదారిని నెగ్గు న టయ్యు కార్యముల్?
జలమున నానుమన్ను గొని, సల్పుఁ గులాలుఁ డభీష్టభాండ; ము
జ్జ్వలశిఖిదగ్ధభాండమును శక్తుఁడె గ్రమ్మఱ మార్చ? మిత్రుఁడా 128

క్షమ నధికారగర్వితులు సఖ్యము గొప్పతుఁ జేయఁ గోరుచుం,
గుమతులు వార కెన్నొ యొడగూర్తురు; గాని య దేమి నేస్తమౌఁ;
బ్రమిదలు దీపముం దమశిరంబునఁ బెట్టుక తైల మిచ్చు; నా
క్రమమున నెప్పుడీ వపుడ కాల్చ దె బగ్గున మంటి; మిత్రుఁడా. 129

అలవడు వేగ; నాశి ఘన మౌఁ; జెడు నోలి; నపాయహేతు వే
యలఁతుల చెల్మి; దానికి మహాజనమైత్రి విపర్యయంబు; చీ
రల వెస ముం దె చిన్నములరం గతిసాంద్రత నంటి, వెంట నే
వెలిసి కలంకు దెచ్చుఁ; జెఱు వేరు విరుద్ధము గాదె? మిత్రుఁడా. 130

చ. చెనఁటులతోడి నెయ్యమునఁ జేటు ఘటిల్లక మాన దెంతస
జ్జనులకు నైనఁ; గాన ఖలసంగతి కెప్పుడుఁ దప్పుకోవలెన్;
ఘన మగుమల్లెపువ్వులఁ బకాపక నవ్వుచుడుంగుఁబుట్టముల్,
గొనకొని చాకిచేత నుతుకుల్ దిను నుంటిని వంటి; మిత్రుఁడా.

చ. నడవడి తిన్న గాక చెడునట్టిచెనఁటుల దిద్ద బుద్ధి తోఁ
బొడమిన, మంచిమార్గమునఁ బోయెడుపోకిరులతోడఁ గూర్తు రె
య్యెడలను; దొంగగడ్డి దిన నీఁగల నావలఁ బోవుగొడ్డులన్
విడువక, లంకె వేయుఁ గద వేరొఁ జీల సాధులతోడ! మిత్రుఁడా.

ఉ. పెద్దలవర్తనంబు గని పెట్టి సుబుద్ధి నిజప్రవర్తనన్
దిద్దుకొనంగ నేర్చు; నది నేరఁడు బుద్ధివిహీనుఁ డౌఁ జువీ;
యద్దముఁ జూచి దిద్దుకొనునట్టిసమర్థత దృష్టిశాలి కే
తద్దయుఁ గద్దు; గాని వసుధం జనుషాంధున కేది? మిత్రుఁడా,

ఉ. ఉత్తముచెల్మిచే సరగ నొందును సద్గుణముల్ సుశీలసం
పత్తి నెసంగువాఁడు; నయబాహ్యుఁడు నైజగుణంబు మాను నే?
యత్తరుసౌరభంబు ధవళాంబరముల్ ధరియించు వెంట నే;
గత్తరకుళ్లుగుడ్డ తనకంపుఁ ద్యజింపఁగ గాదె? మిత్రుఁడా.

చ. ఘనులను గూడు నల్పులును గౌరవపాత్రులు నౌదు రట్టిగౌరవా
ర్హున కయినం బరాభవ మె యుర్విని నీచులసంగతిన్ మనన్;
మొనలను జక్రవర్తిపదముల్, స్పృశియించు లసత్కిరీటరం
ధ్వనతశిరంబు; పల్పుతల వీథుల బర్వులు మోయు; మిత్రుఁడా.

చ. వసుధ నసద్గుణంబు గలబాలిశుఁ డొక్కని కారణంబునన్
దొసఁగు ఘటించి పాక్కెదరు దోసము వీసము లేక నేకులా;
వసదృశ వేదనాకరమహోవ్రణగర్భ పునర్భవంబుచే
లసదఖిలాంగకంబులకు లావు గ వేఁకి జనించు; మిత్రుఁడా.

చ. బలియుఁడ నంచు నల్పులను బాటి యొనర్పక, సారవేముల్లముల్
కలఁత పడంగఁ జేఁత గొఱగా; దిల నందఱతోడఁ బొందె మేఁ

గల నొకబారెఁ డంచుఁ గడుగర్వముతోఁ ఫణి పుట్టఁ దూఱ, లో
పలఁ జలిచీమ లన్నియును బట్టుక చంప వె దాని? మిత్రుఁడా. 137
వలఁతు ల టుంటఁ గా, నలఁతివారలతోడను గార్య ముండు; న
ట్టు లగుట హీను లంచు నెపుడుం జెడ నాడఁగ రాదు సుమ్మి వా
రల; మొహరీలు నాసులు వకాలు కరంబున నుండ, దాగిపై
సలకొలు తే యాశ్యము బజాఱునఁ గేగుట గల్గు; మిత్రుఁడా. 138

---

## ఐకమత్యము.

తల యొక దారి గాక ప్రియదంబున నల్గురు నేక మైనచోఁ,
దలఁచిన కార్య మే దయినఁ దథ్యము గా నెఱవేఱుఁ; బుట్టెఁ డాఁ
కలిగొని పోయి సిద్ధ మగుకంచమునొద్దను గూరుచుండి వం,
గుడుచుట యెట్లు చేరి శ్రమయింగఁ గూడక వే ఱగు నేని? మిత్రుఁడా.
బలమును సొంపుఁ బెంపు విభవంబు సమస్తము నైకమత్య మే
కలుగఁగఁ జేయు; భిన్నతను గాంచున దెల్లఁ దలంప నష్ట మే;
శిలలు ను దారువుల్ మొదలు చేరి మహోన్నతహర్మ్య మయ్యెడున్;
దెలియుము దేని కద్దిగడఁ దీసిన నే మగు నొక్కొ? మిత్రుఁడా.
చెప్పెడి దేమి? దేవుఁడు సృజించినసృష్టిని దేనిఁ జూచినం
జెప్పను నైకమత్యమునఁ జేకుఱు లాభము, లాఁతి నష్టమున్;
గొప్ప గ గాలి గొట్టినను గొండయు జాఱు నె; వానిఁ బాసి పెం
డి ప్పగు రేణువుల్ మొయిలుతీగునఁ దూలును గాని? మిత్రుఁడా.
చెదరక యైకమత్యమును జెందినచో బలహీను లయ్యు నుం
బదుగురు గూడి పాటు పడి భారపుఁగార్య మె నిర్వహింతు రౌఁ;
జెదపురుగుల్ కరం బలఁతిజీవు లయైనను, గుట్ట లౌ యనం
బొదలెడునబ్బురంబు లగుపుట్టలు వెట్టును గాదె? మిత్రుఁడా. 142

ఉ. కూళలు తమ్ము డీకొలుపఁ గొంట్లవివేకత నైకమత్యము
న్మూలము గా, నకారణ మ పోరును రాజనిమచ్చరంబునన్?
గాలికిఁ గత్తి కట్టి రొంజకల్ నిమురంగ నె చివ్వ కుద్దులై
కోళులు ప్రాణహానికిని గొంకక తాఁకును గాదె? మిత్రుఁడా.

చ. తలఁపగ నొక్క తల్లికిని దా రుదయించియు, శైశవంబునన్
మెలఁగి యా నైకకంఠ్యమున, మీఁదట వే ఱగు చుందు రన్నద
మ్ములు; శుభ మానె? నారికడపున్మొవ్వుటాకులు గాలి వచ్చినం
జలనము నొందునే, ముదిరి జంకుచు నుండును గాని? మిత్రుఁడా.

ఉ. ఓలిని నైకమత్యమున నొప్పెడుసోదరు లొందుచుందు రి బ్బల్
మేలులు; వారు వేఱు పడ మేదినిఁ గాంతు రనేకనష్టముల్;
తాళదళంబు వ్రీలక యుదారత నొదల నుండు ఛత్రమై;
వ్రీలి విహీనతం బదను క్రిందను జాఁపగ నుండు; మిత్రుఁడా.

---

## స్నేహితుఁడు

చ. జనునకు నొక్కఁడైనను నిజం బగుప్రాణసఖుండు గల్గినన్,
ఘనతరదుఃఖముల్ దొలఁచుఁ; గావలెఁ దప్పక మిత్రసంగ్రహం;
బనలుఁడు ధూమజాలమున నావృతుఁడై కృశియించి యుండఁగా,
ననిలుఁడు డొగిం బొగం జెఱిచి యాతనిఁ గాచుట లేదె? మిత్రుఁడా.

చ. విహితునిలోపముం బయటఁ బెట్టక యాదలఁ గాచు శిష్టుఁ; డి
మ్మహి సహవాసి దోసమంత మాటక దుష్టుఁడు కీడొనర్చెడున్;
గహిఁ దలపొగ, గాముచు శిరంబును దాఁచుఁ జినుంగుఁ; గాని దా
నహితము సేయు సందయి నయక్ష్వాను మైనబుసఁబు; మిత్రుఁడా.

చ. ప్రియు నయినన్ వెసం బరిహరింప వలెం బరికించి దుష్టు; న
ప్రియు నయినన్ సహించి కడుప్రీతిఁ గొనన్ వలెఁ జొమ్మి శిష్టు;

పయిన విషప్రయుక్త మగునట్టిది భక్ష్యము దోఁచ రెట్లు? చేఁ
దయినను శోధ్యగొంచు నిల నౌషధముం గొన రెటు? మిత్రుఁడా. 148

బాగుగఁ దేనెపల్కులను బల్కుచు మానసముం గరంచి, బల్
నేగి యొనర్చుఁ గుత్సితుఁడు; చేటున కే సుమి వాని నమ్మిటల్;
వాగసారంపుబుజ్జి కలనాదము వీనులవిందు సేయఁగా,
లాఁగ దొలంగి వచ్చి వెతలం బడ దే భుజగంబు? మిత్రుఁడా. 149

మంచియవస్థలో హితులమాడ్కిని సాయము చేయుచుండియుం గ్,
గొంచెము కాలు వంగుతఱిఁ గూళ లపాయ మొనర్తు; రెట్లనం,
గాంచుటకు న్నపాయ మగుఁ గన్నులకుం గ్ సదవస్థ దీపముల్;
పంచన వైరులై కలఁక వచ్చినఁ జూడఁగ నీవు; మిత్రుఁడా. 150

ఎలమిని సజ్జనుండు మన సిచ్చి మెలంగును; గాని యెన్నిభం
గుల నయినం గనంగొనఁగఁ గూడదు నె దుర్జనునంతరంగముం గ్?
దెలివి మెయిం బసందు గను దివ్వియ లాందరునం గనంబడ న్;
గలుగు నె యెంత తోమినను కన్గొన మృణ్మయపాత్రి? మిత్రుఁడా. 151

ఎవ రెటువంటిమిత్రులో గ్రహింపఁగ రాదు సమీక్షనందు; వా
రివిధముఁ జేయఁగా నె లెఁ బరీక్ష పరీక్షమునందు తెస్సగాఁ;
దొవరుఁ జకోర మేల, నెల తోఁచుడు మాతులు విచ్చు నెన్నియో
పువులుఁ బులుంగు? లాతఁ డటు పోయినఁ గుందునె యన్ని? మిత్రుఁడా

కలిమిని నెల్లవారు సహకారులె; వారల నట్టివార ర కాఁ
దలఁపఁగ రాదు; నెచ్చెలుల దైన్యము గాఢపరీక్ష చేసెడిన్;
మెలఁకువలో మనంబునకు మిత్రము లే సకలేంద్రియంబు; లా
చెలిమి యసత్యమో నిజ మొ చెప్పదె నిద్దుర వచ్చి? మిత్రుఁడా. 153

సిరి చెడి వచ్చె నంచు, సిరి చెందె నటంచును, నెంచ కెప్పుడుం
గరమును గారవించుఁ జెలికానిని బొంగుచు నత్సుఖుం; డదే
సరణి ననంగఁ, జూడు మిలఁ జంద్రు వమాసను నిండుఁబున్నమన్
సరిగనె వింగి ముట్టుచును సంద్ర మెదుర్కొనుఁ గాదె? మిత్రుఁడా. 154

చ. ఇనుఁడొక పైకిఁ బెల్లుబుకు హృద్గతతాపము బంధుమిత్రసం
గమమున నాపవార్తులకుఁ; గాన నె దుఃఖము దీఱు నంతలోఁ;
క్షమఁ బెనుబట్టిఁ గాలిచిన సంద్రపుగుల్లను నీళ్ళు చల్లఁ, దీం
ద్రము గను నావి లేచుఁ గద డాయ భరం బగునట్లు? మిత్రుఁడా.

చ. మనసున దుఃఖ మాఁడిన సమస్త మసహ్యము; కానఁ బ్రాజ్ఞుఁడుం
గనఁ దుచితంబు నయ్యెడలఁ; గావలెఁ దప్పక మిత్రుఁ డప్పు; డె
ట్లనఁ, బెనుగాఁక క్రోరునక యగ్గిఁ బడం గమకించు పాలు, త
గ్గునె తమయంతటన్, జలము గొబ్బునఁ బోవక యున్న? మిత్రుఁడా

ఉ. భావము చెర్మి నిండి యెడఁబాయక నచ్చెడు సంగడీలలో
నేవిధి నైన నొక్కనికి నె గ్గయినన్ బెఱ యోర్వ నేర్చునే?
కావటిపూర్ణకుంభముల గ్రక్కున నొక్కఁడు విచ్చి పోవ, నె
క్కువడి భూమిపైఁ బడమి గల్గును రెండవదుండ? మిత్రుఁడా.

ఉ. ఎవ్వరిబుద్ధి వారలకు నెక్కువ గాఁ బని సేయు; దాపదల్
నెవ్వరికిఁ జేయు; నాప్తులను నీవు విశేషశుభావహం బగున్
జువ్వె; స్వహస్తదీపము కనుల్ మిఱుమిట్లు గొల్పఁ జీఁకటిన్;
దివ్వియ భృత్యుచేతియది, తిన్నని తెన్నును జూపు; మిత్రుఁడా.

ఉ. సంపద నార్తి వెంట సదృశక్రియుఁ డొక్కరుఁడే హితుండు; చిం
తింపఁగ నట్టివాఁడు గలఁ డేనికి, భంగము లేదు వానికిన్;
సొంపుగ జాగరంబున సుషుప్తిని నేకవిధంబునం బ్రవ
ర్తింపదె శ్వాస? వద్ది గల దేనియు దేహికి నేమి? మిత్రుఁడా.

చ. చెలు లగువారి దైవ మెడ సేసిన నేమి? తదంతరంగముల్
గలయక దూర మౌనె? యది కానఁబడుం గద వారివృత్తులన్?
నెలకొని మధ్య నాసికము, నేత్రయుగంబును వేఱు చేసినన్,
గలుగునె వేఱు వానికి వికాససముఖక్రియలందు? మిత్రుఁడా.

ఉ. చుట్టఱికంబుఁ జెల్మిఁ గలచోటను నెక్కువదక్కువల్ కొలల్
పెట్టుక మాచుకొక యొదవింతురు నుమ్మి సమానగౌరవం;

బెట్టు లనంగ, రత్నములయిక్క సముద్రుఁడు, శైవలౌఘపూరం
బట్టగు నేటిలోనికిని వచ్చుట పోవుట లేదె? మిత్రుఁడా. 161

. బాగునఁ గూడి యుండి యెడఁబాయుదు రోగునయందు బంధుగుల్ ;
బాగున నన్న మానిన, విపత్తున మిత్రుఁడు తోడు నూపు; నే
లా గనఁ, నవ్వ మగ్గియుఁ గలంపఁ దపింపఁ గ, వెన్నమీఁగడల్
వేగ దధిం బయస్సునను వే అగుఁ; దోఁడగు నీళ్ళు; మిత్రుఁడా. 162

. తనకును జేటుఁగాల మిల దగ్గఁ బడ్డను బ్రాణగొడ్డపుం
బని హితమంచు దోఁచు; హితుపల్కుటుపద్ధతి ప్రాణగొడ్డ మౌ;
గనగన వెల్గుదీపకళికన్ శలభంబు ఫలంబొ పుష్పమో
యని పయి వ్రాలఁజూచు; ఖల దంచటు దోఁచినఁ బోదు; మిత్రుఁడా.

---

## పరోపకారము

. ఆరయఁ దారు కష్టముల నందుచు నైనఁ బరోపకారు లీ
ధారుణిలోన నార్త పరితాపము మాన్తురు తమ్ముఁ జేరినన్;
భూరుహముల్ నిదాఘమునఁ బొల్పఱు చుండియు నెండవేఁడిమిన్,
వారక యధ్వగశ్రమము వాపవె నీడ యొసంగి? మిత్రుఁడా. 164

. కటకట! తాను మృత్యుముఖగహ్వరమందును నుండు కొంచకె
ప్పటికిఁ బరోపతాపమున భావము నిల్పు నరుండు? భీకరో
త్కటచటులాహిరాట్కబళితం బగు చుండియు మండుకంబు, చెం
గట నటు వ్రాలుమక్షికల గ్రక్కున మ్రింగఁ దలంచు; మిత్రుఁడా.

. కర మపకార మొంది యుపకారము సేయుచు నుందురు సజ్జనుల్;
కర ముపకార మొంది యపకారము సేయుచు నుందురు దుర్జనుల్;
బరువడి ఱాల ఱువ్వినను బండు లొసంగు రసాలసాలముల్;
విరుల నలంకరించినను వేదన సేయదె యాఁదు? మిత్రుఁడా. 166

చ. తమ పెఱవారు నా కతిహితం బొనరింతురు నిర్మలాత్ము; లా
క్రి[illegible] నే యొనర్తు రపకారము నెల్లరకున్ మలీమసుల్;
వినుతుల వైన దీపములు వెల్గిడు లాఁతి కభేదబుద్ధితోఁ;
దమతమ పయ్యెనీడలు పదంబుల కడ్డము రావె? మిత్రుఁడా. 167

చ. సూఁడయినం గలంగినను జూడఁగ నోడి విశుద్ధుఁ డాత్మసం
పీడకు నైన నోర్చుకొని ప్రీతిని నాతనిఁ దేర్చు; నెట్లనన్,
బాఁడె యపారమై కలఁకఁబాఱిననీరము నావిలస్థితిన్,
వీడఁగఁ జేయదే పటిక, వే పొడుమై చొరఁబాఱి? మిత్రుఁడా. 168

## భూతదయ

చ. ప్రతిఫల మేమి కోరక శుభప్రతిపాదన సేయువా రకాం
క్షితఫలులై యకారణము కీడొనరించెడువారు నుందు రీ
క్షితిపయిఁ: గమ్మదెమ్మెరలు చెమ్మట లాఱఁగ వీచు వేసఁగిన్;
గొతుకక యగ్గి బగ్గు మని కొంపలు మాపును గాదె? మిత్రుఁడా. 169

చ. అలుక నిజాపకారులకు హాని యొనర్చుట కేమి? పట్టిసా
ధులకును బాధ సేయుటలు దుష్టులనైజము సూ నిజంబు గా;
నెలుకల, దానిబువ్వ భుజియించుటఁ జంపునొ యేమొ పిల్లి; రా
చిలుకలు దాని కేమి పగ చేసెను? వానినిఁ జంపుఁ మిత్రుఁడా. 170

ఉ. చిత్తము కోమలం బగుటచే సహియింపఁడు హింస సత్తముం;
డత్తెఱఁ గాచరింపఁ గఠినాత్మతచే నఘుఁడు పాల్పడున్;
బుత్తడి యెన్నఁడైన వధముం బొనరించునె ప్రాణికోటులన్;
గత్తియ యిత్తడై యినుము ఘాతలు సేయును గాని? మిత్రుఁడా. 171

చ. పలలము మెక్కకుండినను బట్టదు మేనికి సత్తువంచు జం
తులఁ బొరిపుచ్చి తిందు రకరుణుల్; మఱి శాకము సారహీనమే?

యిల బలపౌరుషంబులను నెక్కుడొకో యడవిన్ సృగాలముల్?
కలభము లన్యజంతువులకంటెను దక్కువ వొక్కొ? మిత్రుఁడా. 172
ఉ. ఆఁకలి గొంచు రాఁగ నితఁ డాతఁ డటంచును భేద మెంచు నే?
చేకొని సజ్జనుండు నిరసింపక యేనికి నైనఁ బెట్టెడున్;
కోకిలమున్ శుకంబు నళి గోరిన మాత్రము పెట్టి చూతముల్,
కాకుల నవ్వలం దఱుమఁ గాఁ గనుఁగొంటి మ టయ్య? మిత్రుఁడా.

---

## బాంధవము

ఉ. బాంధవ మబ్బి పేర్మి నిరపాయత నూరెడు నింమ కంత సం
బంధము లేనిచోట, నిలపై భగవద్ఘటనంబు గల్గినన్;
సైంధవ మైనయట్టిలవణం బది యెక్కడ? వన్య మైనక
బంధువ దేడ? రెంటికిని గల్గ దె చుట్టఱికంబు? మిత్రుఁడా. 174
ఉ. చుట్టము లైనవారలకు శోఁకెడుబాధల మాన్ప దక్షుఁ డౌ
చుట్టు; మశక్తుఁ డౌనతఁడు సుస్రుక్కుట దక్క ను తేమి చేసెడున్;
దట్టపుమంచుఁ జిమ్మ నిరతమ్ము ను దమ్ములఁ బ్రోచు వేవెలుఁ;
గట్టెఁడు పశ్చిమాబ్ధిఁ బడ నయ్యవి యేమి యొనర్చు? మిత్రుఁడా. 175
ఉ. ముందుగ బంధుమిత్రులకు మోదము సేయనియట్టివస్తువుల్,
మందుగఁ జేఁదు గా విషసమానము గాఁ దలపోయు సజ్జనుం
డెందు; రసజ్ఞ ఘ్రాణనయ నేంద్రియముల్ మునుమున్న సంతసం
బొందనియేపదార్థముల నొల్లమి తెల్లము గాదె? మిత్రుఁడా. 176
చ- ఎడ మగుకొద్దిఁ జుట్టఱిక మేగును బ్రేమ యు దౌల; సంపదం
గుడిచెడువాడు గాక వగఁ గుందెడువార లె దూరబంధువుల్?
కడఁకఁ గనిష్ఠికాంగుళియుగంబు నిలంబడ నిల్చు; నంగ వం
గెడు నె యొకించు కైనఁ బరికింపఁగఁ జూపుడువ్రేళ్ళు? మిత్రుఁడా.

ఉ. పచ్చగ నున్న నందఱు ను బందుగు లే కడు పార సాఁపడన్;
నెచ్చగ నున్నచో నడుగు పెట్టరు గుమ్మములోన నొక్కరున్;
బచ్చిక వానకాలమునఁ బట్టినయావరణంబులోనికిన్
వచ్చును వేనవేల్పసులు; వానిని వేసవిఁ జూడు; మిత్రుఁడా. 178

---

## మాతృవాత్సల్యము.

ఉ. ధారుణి నెవ్వరయ్యెద రొ ధాఘము ప్రేముడి కంచు జూచినన్
గూరిమితల్లి దప్ప మఱి కొండొకవస్తువు గోచరింప; దే
దార వనం గ, నావు తనతర్ణక మీర్గిన నంగ లార్చుచున్
వారక చేఁత పెయ్య మెయి నాకుచుఁ జేఁపుట లేదె? మిత్రుఁడా.

ఉ. తల్లి భరింపఁ జాలుఁ జుమి తండ్రికి గిట్టనియట్టిబిడ్డలన్;
దల్లికి గిట్ట కున్న మఱి దైవము కావలెఁ; దండ్రి చాలు నే?
పెల్లుగ నాఁడుఁబిల్లి తనపిల్లల గండు హరింప కుండ బొ
పిల్లి భరించుఁ గాని, పులిపిల్లల కెవ్వరు దిక్కు? మిత్రుఁడా 180

ఉ. ప్రేమ సమాన మెల్లరకు బిడ్డలపై; ధనికుల్ ఘటింత్రు గా
రాముగ నంగరక్షలమరంగ; దరిద్రులు సేయ నేర్తు రే?
మామిడిపండ్లు విత్తులను మంచిరసంబున లోనఁ బెంచెదుం
గా? మఱి జీడుమామిడులు గాలికి ధూళికిఁ గాదె? మిత్రుఁడా. 181

చ. కడుపునఁ గన్నకానుపునకన్నను గన్నులఁ గన్నకాను పే
గడితము; కన్నమోహమునకన్నను బెంచినమోహ మెచ్చు గా?
బడలిక గూండ్లు పెట్టినది; బాతున కేమియుఁ బ్రేమ లే; ద దె
క్కుడు గనిపింప దే పొదుగుకోడికిఁ బిల్లలమీఁద? మిత్రుఁడా. 182

ఉ. ప్రేముడి పెద్ద గల్గునెడ భీతికి హేతువు లేక పోయినన్
దా మది లేని వెంచుకొని తత్తఱ మొందుట నైజ మేరికిన్;
గోమలతర్ణకంబుపయిఁ గూరిమి బాలురు చేరఁ బోయినన్,
బామర మే మొకో యెగసి పైఁ బడఁ బోయెడు నావు; మిత్రుఁడా.

## సంతానము.

చ. మొఱకుఁగలంబునన్ సుగుణపూజ్యుఁడు పుట్టి యశంబు దెచ్చెడున్;
నెఱకొలమందు నింద్యుఁడు జనించి యడంచును దొంటికీర్తియున్;
గఱకుటనాసకున్ ఫలము గల్గి సువాసన గూర్చుఁ; దీయనౌ
చెఱకున రిత్తవె న్పొడమి చెంచెనమాధురి మాపు; మిత్రుఁడా. 184

ఉ. అచ్చపుగొప్పవంగసమునం దుదయింప రనేకు లుత్తముల్;
కుచ్చితపుంగులంబునను గూళ లసంఖ్యులు గా జనింతు రా;
నచ్చెరువా? రసాలఫలమందున వి త్తొకఁ డుండుఁ; దిక్తపుం
బుచ్ఛశలాటునం దిమిడి బుట్టెఁడుబీజము లుండుఁ; మిత్రుఁడా. 185

ఉ. ఊరును పేరు లేనియుపయోగవిహీను లనేకు లేల? వి
స్తారగుణోత్తరుం డొకఁడె చాలు విశాలయశంబు దేరఁ గాఁ;
దారక లెన్నియో చదల దట్టముగాఁ గల వైన నేమి? య
క్కైరవిణీశుచేఁ గద ప్రకాశము నాకస మొందు? మిత్రుఁడా. 186

చ. అలఘు లనేకు లాసపడునట్టిమహాత్ముల కీక, దైవ మీ
యిలపయి నేరుఁ గోరనివిహీనుల కిచ్చును సూనులం గడున్;
సలలిత మారసంబున రసజ్ఞుకు నిం పొనరించునించులన్
ఫలములు పుట్ట కేమిటికొ పాడుముసిండులఁ గల్గు? మిత్రుఁడా. 187

చ. ఒకజనయిత్రిగర్భమున నుద్భవ మొందిన, నందఱుం బ్రియో
జకులుగ నుండలే రఫలజన్ములు నుందురు గొంద ఱందులో;

నొకసమయంబునందె కలమోదరసంభవ మైనవెన్ను నో
పికఁ గనఁ బొల్లుఁగాయలు సుబీజము లుండవె యందు? మిత్రుఁడా.

చ. జనకుఁడు యోగ్యుఁ డైనఁ, దనుజాతులు నట్టులె యుండ నేర్తురే?
తనయుల కారణంబున వెతం బడువార లనేకు లుందు; రె
ట్లనఁగ, శిరంబు పూజ్య మగువంగక మయ్యును బేలకారణం
బున నొరుచేతఁ జిక్కి పలుపోట్లను బొందుట లేదె? మిత్రుఁడా. 189

ఉ. పెల్లుగఁ దల్లిదండ్రులనె పేల్చక తింగురు; లాఁతిప్రాణముల్
బెల్లముకన్నఁ దీపి గను బిల్వక యుండరె దుష్టనందనుల్?
నల్లుల వేరిచెమ్మటకణమ్ములఁ బుట్టునొ, వారి నే యెడ
ల్లెల్లను మంచఁ గుట్టు? నరుదే యొరునల్లను గ్రోలి? మిత్రుఁడా? 190

చ. పొడుగువఁ దల్లిదండ్రులకు భూరివిషాదము సేయఁ గల్గున
కొడు కుదయింప కుండినను, గొబ్బునఁ జచ్చిన నొండె, మే లగున్;
నుడువఁగ రాని వ్యాధుల మనోవ్యథఁ జేసెడుకీటకంబు దాఁ
గడుపునఁ బుట్టె నెవ్వరును గాంక్ష యొనర్తురు గాదె? మిత్రుఁడా. 200

ఇది శ్రీపరమేశ్వర వరప్రసాద సమాసాదితసరసకవితా ధురంధర వడ్డాది
సాధువంశ క్షీరనీరాకర రాకాసుధాకర రాచ్చనామాత్య పౌత్ర హరిత
సగోత్ర పవిత్రగుణకదంబ లక్ష్మాంబాగర్భ శుక్తిముక్తాఫల సూ
రప రాజప్రధానతనూభవ విబుధవిధేయ సుబ్బరాయ
నామధేయ విరచిత మగుసూక్తి వసుప్రకాశకము
నందుఁ బ్రథమభాగము.

శ్రీరస్తు.

# శ్రీసూక్తివసుప్రకాశకము

## ద్వితీయభాగము.

———o———

### ప్రయోజకత్వము.

ఉ. స్థానము వీడినన్ సుకులజాతు లనాదృతు లప్రయోజకుల్;
మానితు లల్పవంశజులు మానిన స్వస్థలముం బ్రయోజకుల్;
మానవమూర్ధజం బయిన మాన్యమె కేశకలాప మూడినన్;
బూనరె మౌళిఁ దుచ్ఛపశుపుచ్ఛజమున్ సవరంబుగ మిత్రుఁడా. 1

ఉ. మస్తకమందు నుంచుక సమస్తజనుల్ గొనియాడు వస్తులున్,
బ్రస్తుతి లేశముం గనక స్వస్థలముం దతినైచ్య మొందెడున్;
శస్తసువర్ణభూషణముసంగతి గాంచెడుపీలికుచ్చు, దు
ర్వ్యస్తువుఁ బోలెఁ బిట్టకడ వాలముక్రిందఁ నణంగు; మిత్రుఁడా. 2

ఉ. ఒక్కెడ లేమి వచ్చినఁ, బ్రయోజకు లప్పుడ యాత్మజీవనం
బెక్కడ నైనఁ గందురు; గతి యేది యడంగెద రప్రయోజకుల్;
నిక్కము, పంకజాకరము నీ రవురంగ విహంగమంబు లే
దిక్కున కైనఁ బోయెదును; దిక్కిఁక నత్తల కేది? మిత్రుఁడా. 3

ఉ. ముంగిటఁ బూర్వజన్మకృతపుణ్యము పెన్నిధి దెచ్చి పెట్టినన్,
వెంగలి యైనఁ దా ననుభవింపఁగ నేరక పాడు సేయు; నీ
సంగతి సత్యమే; కుదుటఁ జల్లగ నాతినపా ల్లభించినన్,
బొంగుచుఁ ద్రావ లే కొలుకఁ బోసికొనుం గద పిల్లి? మిత్రుఁడా. 4

ఒరులకుఁ గల్గులోపముల నొప్పుగఁ దీర్పఁగఁ జాలునాతఁడున్,
గని యసమర్థుఁ డౌఁ దనకుఁ గల్గులోపమును బాపుకొంట; క
చ్చెరు పడ నేల? లోకముల చీఁకటిఁ జోఁపు సుధాకరుండు, న
స్థిరనిజమూర్తి కళంకమును దెల్పఁగ నల్పుఁ గలండె? మిత్రుఁడా.

-. కాలము రాక మున్నొకటి గల్గినఁ గాచినఁ గాచుఁ గాని, పోఁ
గాలము రాఁగ నెద్ది యొనఁ గానఁగ లేఁదు ప్రయోజనం బిలన్;
జాలఁగ గాలి వీచినను, జక్కఁగఁ గాయలఁ బ్రోచు వృంతముల్
నేలను రాల కుండ; మఱి నేర్చునె పండిననాఁడు? మిత్రుఁడా.

---

## కామము.

-. కామము వృద్ధిఁ బొందుటకుఁ గారణ మారయ సంగమంబు గా
కే? మది దానిచే గెలువ నెంచుట యగ్గిని నగ్గి నార్చు టే;
భూమిని నాముఁదాఁటిగెల, పూఁటకుఁ బూఁటకుఁ గత్తి హత్తెనా,
యే మెయి వెట్టినీళ్ళ చెమరింపక యుండెను నయ్యా? మిత్రుఁడా.

-. కామముఖారివర్గ మధికం బగుఁ దత్తదభీప్సితక్రియల్
ప్రేమను జేయఁ; గావున నుపేక్షయ సంక్షయకారి వానికిన్;
భూమిని బ్రజ్వలించు హుతభుగ్భయదార్చులు, ప్రీతికృల్లస
ద్ధామసమిత్ప్రదానమున నాఱు నె మానినఁ గాక? మిత్రుఁడా.

-. తా దృఢచిత్తుఁ డయ్యు ననిశాజనసంగతి కెన్నఁ డేఁ గా
రాదు; తదుజ్జ్వలాంగకవరప్రభ డెందము నీరు సేసెడిన్;
మేదిని లోహ మర్చులసమీపము నొందెడుదాఁక గట్టి; యా
మీఁదను వెన్నముద్దకును మెత్తని దౌచుఁ గరంగు; మిత్రుఁడా.

-. సన్నిధి నన్నదోషమున జయ్యన నెయ్యము హెచ్చి, నీచు నేఁ
గ్రన్నన బొందఁ దోఁచు; నటు గావున నొండ్లకు దౌల నుంట మే

లన్నులు; పొన్నగున్నపయి నల్లినవల్లిక యైన, దాపు గా
నున్న నొకప్డు తుమ్మపయి నొందెను వాలిక యున్నె? మిత్రుఁడా. 10
చ. కాంతుఁడు పేద యే నతినిఁ గాంచి చలింతురు; భాగ్యవంతు నే
నంత చలింప కుందు రొరుఁ జూచి పతివ్రత లాత్మయం; దయ
స్రాంతముఁ జూచినం గదటఁ గాలులు వచ్చినయట్లు నూచికల్
చెంతల వజ్రి మున్నను జలించునె యించుక యైన? మిత్రుఁడా. 11

---

## క్రోధము

ఉ. కోపులె యైనవో బుధులఁ గొంకరు దుష్క్రియ లాచరింపఁ గాఁ;
బాపము దాన వారలను బైకొని తేజము మాప కున్నె? సం
దీపితుఁడై తమంబును మథింపఁగఁ జాలినకీలి ధూమజా
లాపహృతప్రకాశుఁ డగు నగ్ని దహించుటఁ జేసి; మిత్రుఁడా. 12
ఉ. తామస మున్నమానవుఁడు తా మసి యౌట విరుద్ధమే? నిజ
క్షేమముఁ గోరువాఁడు నిరసించుట మే లగు మండెపా; టిలం
బామినయంత్రమాత్రమున బగ్గున మండెడునగ్గిపుల్ల బు
గ్గౌ; మఱి మండకుండునని యాపద నొందదు గాదె? మిత్రుఁడా. 13
ఉ. కోపము రాదు కోవిదునకుం, దనకుం బరు లేమి చేసినన్;
గాపురుషుండు తద్విధమునం బరమాత్కుము పూనఁ జాలు నే?
బాపురె! వాఁడి రాదు గద పైఁడికిఁ గాలిచి కొట్టి రాచినన్?
సైఁపదు గాదె యట్టినుము, శాతముఁ బూనును గాని? మిత్రుఁడా. 14
ఉ. చాలఁగఁ గోప మెత్తినను, జల్లనిమాటల శాంతిఁ బొందెడుం
బోలఁగ సజ్జనుండు; మఱి పొందక దుష్టుఁడు చూపు దౌష్ట్యమున్;
బాలకుఁ బొంగు రా, జలము పైఁ జిలుకంగ నడంగుఁ; గాని దు
స్తైలము బగ్గున న్మోసి ధూమము గాచ్చును గాదె? మిత్రుఁడా. 15

చ. తులువలు తుచ్ఛవాక్యములఁ దూలఁగ నాడినయంతమాత్రఁ జే,
వలుక జనించు నెట్టులు మహాత్మునిశీతలమానసంబునన్?
జెలియలికట్ట నిల్చి తనచేతఁ దృణాగ్నిని వీచి వైచినన్,
జలధిజలంబులం దుడుకు సంభవ మయ్యెడు నయ్య; మిత్రుఁడా. 16

ఉ. ఓపికతోఁ బదుల్ సలుపునాప్తముతోడను మేల మొప్పు; నుం
గోపులతోడ నెన్నఁ డని గూడ; దనర్థము సంభవించుఁ; గ్రీ
డాపరబుద్ధి నాటకుఁ గడంగిన నందము కందుకంబుతో;
నాపని గాజుతో సలుప నర్హమె గర్హ్యము గాక? మిత్రుఁడా. 17

---

ఆశ.

ఉ. ఆసకు మేర లేదు; తమయాత్మ కుండినఁ దృప్తి లెస్స; పే
రాసకుఁ బోయినం, గరము హాని యగు; న్నిజ మెట్టు లన్న, బు
ష్పాసవపూర్ణకుంభమున యంచున తేనెను మక్షికాత్ము ధా
త్రాసము వాయదే? మునిఁగి ప్రాణము గోల్పడ నేల? మిత్రుఁడా. 18

చ. కలిగినమాత్ర మిచ్చిన వికాసము దోఁచును యోగ్యమోమునం;
దెలమి దురాశపాతకున కెంత యొసంగినఁ గల్గ నేర్చునే?
జలదము వర్షముం గురియ, సారపు నేలను ఘాసపూలికా
చ్ఛలమున రోమహర్షణ మెసంగు; నెడారి న దెట్లు? మిత్రుఁడా. 19

ఉ. ఇచ్చను దృప్తి యున్నఁ దృణమే యొక మేరువుగాఁ దలంచి తా
నెచ్చుగ సౌఖ్య మొందును; నతృప్తియ యున్న విరుద్ధ మయ్యెడున్;
బచ్చిక నల్లుకొన్న తెర, పచ్చలకంబపుఁ జందమామ డా
మెచ్చులమేడ చెల్లి కెకిమీనికి మేడయు మెచ్చె? మిత్రుఁడా. 20

చ. పరవనితార్థలోభ మది పాపము పాపము నమ్మ; దానికిం
జొరక సుఖించుటే సుఖము; చొచ్చినఁ దప్పక ముప్పు వచ్చుఁ; గో

పరతను బోరి పోరి వృషభంబులు పొందును శృంగభంగమున్;
బొటియలు త్రివ్వి త్రివ్వి తుది బోనన నెల్కలు చిక్కు; మిత్రుఁడా.

---

## జుగుప్స

-. మ్రుక్కడు లేవపుణ్యబనులు మొక్కలు లై యొనరించు చుండియున్,
మ్రుక్కరు సద్గుణన్ ఘనులఁ జూచియు; నీచుల కేవ మున్న దే?
కుక్కలు పెంటగోతులను, గొల్లున నెంగిలికూటి కుద్ధతిన్
మిక్కిలి కాటు లాడుచు, శమింపవు కుంభులఁ జూచి; మిత్రుఁడా. 29

చ. కలుషము లాచరించుట కకల్మషుఁ డెంతయు జంకుఁ; గాని పం
కిలుఁ డిలఁ గొంకు నెట్లు, పరికింప మఱింతగ నుత్సహించుఁ గా?
కలపెనుఱొచ్చుగుంట గని యానుఁ బోవును గోవు; దానిలోఁ
గలుకుచుఁ గాఱుచున్న పడి కొట్టిన లేవగు గాదె? మిత్రుఁడా. 23

-. ఎప్పుడు రోఁతలోఁ బొరలు నెడ్డె కదే ప్రియ మాను; యోగ్యపుం
జొప్పులు ప్రాణగొడ్డము లె; నంతయు నింపులు గావు వానికిం;
గుప్పునఁ గంపు కొట్టు చెడఁగుళ్లినపుండుల నుండు పుప్పికిం
గప్పుర మిష్ట మానె, యది కాంచిన నష్టమె గాక? మిత్రుఁడా. 24

ఉ. భాగ్యము చాలఁ గల్గినను, బాడుగొనంబులు వీడ రన్నువల్;
యోగ్యులు పేద లయ్యుఁ దమయుత్తమవర్తన మాన లేరు; రా
డ్భోగ్యపదార్థ ముండినను. బుచ్చినయెమ్ములు దెచ్చుఁ గుక్క; లా
రోగ్యము దప్పి నుక్కియు హారుల్ పులు మేయునటయ్య? మిత్రుఁడా.

---

## ఈర్ష్య.

చ. పలుగులు గన్ను లుండినను బాగగు వస్తువుఁ జూడనోడి లోఁ
గలఁగుదు; రైన దానికిని గా దది లోపము; వారిపాప మే;

వెలుఁగును గాన లే కోకకవిం బెనుఁజీఁకటిలోన నుండు గ
బ్బిలములు, దాన నొకొఁటఁత వెల్గుదె వానిది గాక? మిత్రుఁడా. 22

ఉ. చెన్నఁటు లాత్మవస్తువులు చెడ్డవి యైనను గారవించి, సం
పన్నగుణంబు లైనఁ బెఱవారివి దూఱుదు రోర్వ లేక; రొ
ట్లన్నను, గాకిమూఁకలు నిజాత్మజులం బ్రియ మారఁ బెంచుచుం
దన్నుచు నుండ వే పరభృతంబులబిడ్డల రేఁగి? మిత్రుఁడా. 27

---

## తొందర.

చ. పరగ జనించి వే పొదలు పర్వపదార్థములు న్నశించు నా
సరణి న; తద్విరుద్ధములు శాశ్వతముల్; తొర మేలు గాదు గా?
పెరిఁగెడు నేఁపు గాఁ జినుకు పృథ్విఁ బడం జిగిలింత; నిల్చు నే?
చిరగతి మొల్చి వృద్ధి యగుచింత ధ్రువం బగుఁ గాని; మిత్రుఁడా. 2

ఉ. వేగిరపాటుచేత నొకవేళను గార్యము గా నె చూడు, తో
జాగున కోర్చి యిమ్మగను సాగఁ గ నిచ్చిన దాని కీడు రా;
దోగు గనంబడుం; బనఁటి నూఁద్దర గొట్టినయంటిపండ్లనుం
బాగు గ వచ్చు నే, ముదిరి పండినపండులతీపి మిత్రుఁడా. 2

ఉ. ఓరుపుఁ బట్టుఁ గల్గిన, ఫలోదయ మాఁ గృషికిం దనంత నే;
సారెకుఁ దత్తఱించిన, వసడ్డగ నుండిన, వ్యర్థ మయ్యెడున్;
బోరల ఘ్రిడ్డులం బొదుగఁ బుల్గులు పెక్కుదినంబు లోపికం
గూరిమి, బోద లౌఁ; బగులఁ గొట్టిన, మానిన, నా నె? మిత్రుఁడా.

చ. విడువక నాఁడునాఁటికిని వృద్ధి యొనర్చినఁ గాక, యొక్కటే
విడుతను జేయఁ జూచినను, వేగ్రఁగ లసాధ్యము లౌను గార్యముల్;
కడుపున శుక్లపక్షశశికైవడి వర్ధన మొందు గర్భమం
బడలక మోయుఁ దల్లి; యొకమాటటు పూనఁ దరంబె? మిత్రుఁడా.

ఉ. చక్కఁగ నుత్సహించి పని సల్పు ఘనుండె మహర్షి; వ్యర్థ మౌ
నొక్కపుఁ డైన మానుకొన కోపికఁ జేసిన రిత్త పోవు నే!
చొక్కపుటుట్టిపుచ్చు విడుచుం దవరేఖలఁ; గల్గు వత్తముల్;
దక్కఁ బోకపన్; డైనఁ దుది దక్కు నె కొన్నిటియందు? మిత్రుఁడా. 32

---

## శాంతత్వము.

చ. గురుసుఁదనానఁ బైఁ బడును దుంగుడు; కట్టుడు దీర్ఘదన్ను వే
గిర పడ కుండు నెండ; తుత్తిటి కి మ్మన గుంతిన. నాఁడె పోవు; భా
స్వరఘటికారమందు, ఘనసంబులముల్ తనపైకి రాఁ గఁ, దాం
దర పడి గంటనుల్, మగల దానిని బైకొన నయ్య? మిత్రుఁడా. 33

చ. అలఁతులకు బదుల్ మొసయూ నయ్య మహాత్ముఁడ? వారు పేర్లుకా
ఉలు తనుఁ గానియట్టులు నెఱుంగనియట్టులు గా నటించెదన్;
ములువచఁపనఁ బునన్ భషకముల్ తనముందఱ భౌకరించినం,
గలభము ఘీంకరించెదు నె క్రిమ్మఱ గోసముఁ జెంప? మిత్రుఁడా. 34

ఉ. శాంతులఁ జూచి మోహకులు చాలమి వెట్టుదురంతె; వారిని
ర్భ్రాంతి దురాగ్రహోగ్రులకుఁ గల్గు నె? చెయ్యులు వజ్రతుల్యముల్;
వింత యె? కొండ కోడి యడవిం దహియించు దవంబు; కొండ నిం
తింతలు గాఁగఁ గోసి ప్రవహించును జల్లనినీరు; మిత్రుఁడా. 35

ఉ. క్రోధుల చేఁతలం జెడినఁ, గొంతయినం గల దాస మేదినిన్;
సాధుల కల్కి వచ్చినను, సర్వము శూన్యము గాక యుండు నే?
సౌధము నగ్ని యంటుకొనఁ జక్కఁగ దన్ను గోడ లైనఁ; సం
బోధి యడంగె నేని యవి భూమిని బూడక యుండు నే? మిత్రుఁడా 36

చ. కనులను నిప్పుకల్ గురియఁ గాఁ బయి వచ్చుమహాగ్రకోపి యుం
దనకడ నోరు పున్నయెడఁ దగ్గ్గణఁ ఠంచ ఫ శఁ లె చెయ్యెడున్;

ఘన మరుధూళితోడ వడగాడుపు భీకరభంగి వీచి, చి
క్కని తడివట్టివేళ్ళతడకం బడి చల్లన గాదె? మిత్రుఁడా. 37

ఉ. శాంతుల కెగ్గుఁ జేసినను, సంతస మొందు నె దైవ? మక్కటా!
యంతకు నంత వారలకు నప్పుడె గట్టిగఁ గట్టి కుడ్పుఁ డే?
కాంతి నడంచుఁ బున్నమను గల్వలఱేనికి భూమి యడ్డమై;
ధ్వాంతము కోటికొండ లయి దానిని మ్రింగదె దాన? మిత్రుఁడా. 38

---

## ధైర్యము.

చ. పలుకడగండ్లు వచ్చినఁ, బ్రపంచమునందు వినీతు లోర్చి య
వ్వలఁ దల యెత్తి కొందురు సరవారలలోఁ; జెడిపోదు రుద్ధతుల్;
హాలికకుఠారఖండితము లై మరలం జిగిరించు శాఖ, లీ
యిలపయి నిట్టతాడులును సీఁతలు రూపఱుఁ గాదె? మిత్రుఁడా. 39

చ. శ్రమ తమ కైనచో హృదయసారము గల్గినవారు లోనిదుః
ఖము వెలిఁబుచ్చ కుండెదరు; గాని తదన్యు లటుండ నేర్తురే?
తమకమునన్ హుతాశనుఁడు దాహము సేయుచు నున్నఁ, జేవదూ
లములను బుట్టునే వెదుళులం బలె ఘోరరవంబు? మిత్రుఁడా. 40

ఉ. ప్రబ్బుచు సంభవించెడువిపత్తులు చుల్కనివారిఁ బట్టి త
బ్బిబ్బొనరించుఁ, గాని వెఱపింపఁగ లేవు సుమీ మహాత్ములన్;
మబ్బులఁ దూలఁ బుచ్చుఁ బవమానము చిత్తము వచ్చినట్లు; తా
గుబ్బలులం గదల్ప సమకూడునె యెన్నఁటి కైన? మిత్రుఁడా. 41

ఉ. ఆపద లొంది చెన్నటియుం నార్యులు వెన్పడ; రవ్వి సేయు నే
కాఁపుర? మట్లు సంపదలుఁ గల్గును; గాలవశంబు లన్నియుఁ;

దేవకు వల్లమబ్బు లరుదేర మఱుంగుచుఁ బోవఁ దోఁచుచున్;
జాపల కోర్చి రాజు రుచిసంపద నొందఁడె మున్ను? మిత్రుఁడా. 42

---

## ప్రతాపము.

ఉ. ఇంద మటంచు మాళి నొకఁ డీ వలెనే? నిజశక్తి విద్విష
ద్బృందము నోర్చి తానె కొను వీరుఁడు; రాజ్యము వీరభోజ్యమే;
పంను తెలుంగు లేనుఁగులఁ బట్టుచు గట్టెనె సింహడింభమున్
నుందలకున్? స్వకీయమహిమం బ్రభు వయ్యెను గాక; మిత్రుఁడా. 43

ఉ. తేజము గల్గువాఁ డవమతిన్ సహియింపఁ గ లేమి యెచ్చటన్
నైజము; వానికి న్వయనుసం బని యేమి యు లేదు చూడుమీ;
తేజున మీఁద దోప్రమిదదీపము, జక్కఁగ వెల్గ నిచ్చునే,
రాఁజుచుఁ గ్రిందఁబ్రమ్మిదను రాలినదీపపుమొగ్గ? మిత్రుఁడా. 44

ఉ. మెత్తనివాని నందఱును మిక్కిలి బాధ యొనర్తు; రాగ్రహో
యత్తునిఁ జోలి కేగ రొక రైనను; నొప్పున కేది మెప్పలన్?
మెత్తును జాలి లే కనిశమున్ ఘటకారుఁడు పచ్చికుండఁ; గం
చిత్తును దాఁక బోఁడు గద చిచ్చునఁ గాలుఘటంబు? మిత్రుఁడా. 45

చ. తలఁకెడువార దుర్మదులు దర్పితులై బెదరింతు రూరకే;
తలపయిఁ దన్నువారలకు దండము వెట్టుచు లొంగి యుండ రే?
కెలఁకుల కేగువారిపయిఁ గే లటు సాఁచును మత్తవేనుఁగుల్;
గలఁగుచు మావటీలఁ గని కాళ్ళను మ్రొగ్గును గాదె? మిత్రుఁడా. 46

చ. బెదరిన లేఁగ పైఁ బడును భీకరశంగిని దుర్జనుండు; తన్
గదిమి యెదుర్చుచోట నిజగర్వము సర్వము దూలి పోయెడున్;
మొదట మొఱింగి కుక్క తఱుముం గద యూఢని బాడువారలన్;
దుదఁ దను వ్రేయువారిఁ గని తోఁక ముడుంచుక పాఱు; మిత్రుఁడా. 47

చ. నరుఁడు ప్రతాపవంతుఁ డయినం, దను మీఱినవారతేజముల్
వరుస హరించి, లోఁబడినవారికి సొంపును బెంపుఁ గూర్చు; భా
స్కరుఁ డుదయాద్రి నెక్కి, పయిఁ గ్రాలెడుచుక్కలఁ ద్రొక్కి, కాంతిభా
స్వరకనకాభిషేకమును సల్పు నగాగ్రములందు; మిత్రుఁడా. 48

ఉ. శూరుఁడు దైవలోపమున సుక్కియు ధీరత నిందఁ బోయెడున్;
భీరుఁడు వల్ల దప్పినను, బెగ్గిలుచు న్వెనుదీయ కుండునే;
నేరుపు దక్కి బాహులు మునింగిన ముందఱ కే మునింగెడున్;
ధారుణిఁ బాదశాఖ లటు దా మొనరించు నటయ్య? మిత్రుఁడా. 49

చ. అరయఁగఁ బాఱఁబోతు మెనయం గలఁడయ్య ప్రతాపవంతు, హీ
విరహితుఁ డై యరాతికిని వెన్నిడి యూడనిఁ బాడుఁ గాక; తా
నరుణగభస్తిదిక్కు మొగ మై యెపు డైనను నీడ పోవఁ గాఁ
జొరవ యొనర్చునే, మఱుఁగఁ జూమును గా కడ లొంటి? మిత్రుఁడా

ఉ. ముక్కున నాచి గల్గఁ, జెఱమూఁకల నాకుల నెట్టుఁ గాని, తాఁ
జిక్కఁ, దగాతి శాయుధము చేపడ నీయఁడు, శూరుఁ డెన్నఁడున్;
గ్రక్కున వేగు రైనను ముఖాముఖి డీకొని తేర నేర్తురే
యుక్కున, జీవ మున్నపుడి నొందెను, దన్నఖ మొందెఁ? మిత్రుఁడా. 51

చ. తొడరి మహామహుండు తనదుస్వహవిక్రమ మొక్కయెల్ప పై
నడుగక మాపునే; తగుసమున్నతుమీఁద న మాపుఁ గాకిలం?
బిడుగు భయంకరార్భటిని బిల్లుపయిం బడు నయ్య, మిన్ను ద
న్నెడిమెడలన్ మహాద్రిధరణీధ్రములం బడుఁ గాని? మిత్రుఁడా. 52

ఉ. క్రౌర్యము సూపుక్రూరుసెడఁ గ్రౌర్యము సూపుట యే ప్రశస్తపుం
గార్యము; ప్రాణహానికిని గాఁ ణ మా నుజనత్వ మయ్యెడన్;
శౌర్యముతోడ బున్న మని సర్ప మెదిర్చిన, దుడ్డుఁగఱ్ఱతో
దౌర్యగ మొప్ప నొప్పగును; దోసిట నొప్పిన మూప్పె; మిత్రుఁడా. 53

వ. చతురుఁడు దూరభీరుత యుఁ స్వమ్ముఖశూరత నూపు; వంచనా
చతురుఁడు కేవలం బతనిచర్యలకు న్విపరీతకార్యుఁ; డు
ద్ధతు రిపు డాయుచుంతఁ కనిపి ద్దాఁగి పదంపడి వాఁడె నూపు; ముక్
ధృతి బహిరంగ మైనయొ తీఱనని న్వోనుదీయుఁ; మిత్రుఁడా. 54

ఉ. తనకు ఘుటిల్లుహానికిని దప్పుకొనన్ నెర వొందు లేనిచో,
మనుజుఁడు నైజదేజమును మానక చూపుట లెస్స; యె ట్లనన్,
శునకము వెంట నంటి, తనుఁ జులుకనఁ జంపగ వచ్చుచున్నఁ, జెం
తను దరు నైన లేనపుడు దాఁట దె పిల్లి యెదిర్చి? మిత్రుఁడా. 55

---

## ఘనుఁడు.

ఉ. ఎంతయు నాప యుండినను, హీనుఁడు తోడెము నే గ్రహించుఁ; గా
సంతయుఁ జిక్కకుండఁ దనయాసను దీర్చుకొనున్ ఘనుండు; నీ
రంతికమందు వెల్లివిరియుం గొనుఁ గొంచెమె చిన్నకన్న; మొ
క్కంతె కొఅంత లేక కడు పెల్లను నింప దె చెర్వు? మిత్రుఁడా. 56

ఉ. హీనుఁడు వానిపొట్టకొఅకే పొర లాడును; గాని మానముం
బూనినవాఁ డనేకజనపోషకపౌరుషకారి యయ్యెడున్;
శ్వానము దానిమట్టు కొకశల్యము కోర గ్రహించు; ధీరపం
చానన మెన్ని యో తినఁగఁ జాలుగజంబు వధించు; మిత్రుఁడా. 57

చ. ఘనులు ను నుర్వి నల్పులకుఁ గానఁగ వత్తురు వారయట్లు; త
జ్జనులకు దూరయోజనము చ్చాలదు గావున; వా రలంతు లే?
కనులకు సూక్ష్మరూపమునఁ గన్పడునంత నె బుక్షముల్ నభం
బున నటు లుండు నయ్యా? యువి భూమికి క్షైన్యుఁడు గావె? మిత్రుఁడా.

చ. ఘనుఁడు సమస్త దేశముల గౌరవ మొందును; నీచు నైచ్య మొం
దును; నవివేకిచెంత నిది దోఁచు విరుద్ధత; నెట్టు లన్న, నెం
దును వలకేలు మన్నన గనున్; దెఅకే లవమాన మొందు; నై

నను విపరీత మై యిది గనంబడ దే శిశునందు? మిత్రుఁడా. 59

చ. పుడమిని వన్నె వాసి గలపూరుషుదోషము స్వల్ప మైన, వె
ల్లడి యగు చుండుఁ, బాపి పదిలక్షలు చేసిన, బైట వచ్చు నే?
మడుఁగుఁజిలుంగుఁబట్టమున మ న్నొకయించుక సోఁకినం గనం
బడియెడు; నీలిగుడ్డ చెడమాసినఁ గానఁగ రాదు: మిత్రుఁడా. 60

చ. అనఘులు సైతముం బ్రభుకటాక్షము గల్గిన వన్నె గాంచెదర్;
ఘను లయినం బ్రకాశమును గాంచఁగ లే రది లేక యున్నచోఁ;
నినకిరణాప్తిచేఁ దుఱఁగలించుఁ దళత్తళ లూతతంతువుల్;
గన జరబాజుఁబోఁగులు ను గా కటు భాసిలు నెట్లు? మిత్రుఁడా. 61

ఉ. గౌరవలాఘవంబులను గాంచి మహాఘననీచవృత్తులన్
ధారుణి నుండఁ గల్గెదరు దైవమునాజ్ఞనె యుత్తమాధముల్;
పౌరుషశక్తి గా దని; విభాసురశుద్ధసువర్ణధర్మముల్,
తేరఁ దరంబె యిన్మనకుఁ దీఱనికాఁకల నైన? మిత్రుఁడా. 62

ఉ. ధీరుఁడు సేర వచ్చినను దిగ్గన లేచి సమంచితార్హస
త్కారము లాచరింప వలెఁ; దక్కినచోఁ దన కే కొఱంత సూ;
సూరుఁడు రాఁ బరుండుజను సోమరి యందురు; కాల్యకృత్యముల్
నేరుపుతోడఁ దీర్చునతనిన్ సుజనుం డనుకోరె? మిత్రుఁడా. 63

---

## దుర్జనుఁడు.

ఉ. దంభిని వేషధారు లోకకొందఱు గల్గుటఁ జేసి భాసురా
దంభవిశుద్ధమూర్తులకు దారసిలున్ సిలుఁగుల్ నిజంబు; వి
శ్వంభర గుల్లముత్తెములు సంభవ మాటను గా దె యెవ్వరున్
శుంభదమూల్యమౌక్తికమణుల్ గని నమ్మరు ముందు? మిత్రుఁడా. 64

ఉ. పరులను జిక్కులం బఱుప భావమునందుఁ దలంచువాం డరయో!
గురుతర మైనచిక్కులం దగుల్కొను చుండురు దా మె ధారుణిన్;
త్వరితగతిం గవాటములు ద్వారనిరోధము సేయఁ బోయి, దు
ర్ధరదృఢశృంఖలార్గళవిధానవిరుద్ధము లౌను; మిత్రుఁడా. 65

ఉ. ఎంచఁగ మాయచే నొకని నేని జయించు నొ లేఁడొ చెప్ప లే;
నంచితసత్స్వభావమున నందఱఁ దాఁ త్రుటిమాత్ర గెల్చుఁ; బై
మించు వెన్ను చూపినను, మెక్కుఁ డొకండు ముసిండిపండు; ద
ర్శించిన నేనిచిత్తము హరింపను మాతఫలంబు? మిత్రుఁడా. 66

ఉ. వంచకుచేత నొక్కమతి వంచితుఁ డైనమనుష్యబుద్ధికిన్
మంచిజనుండు సైత మొకమాయికుఁడుం బలెఁ దోఁచు చుండు; నె
*ట్లంచన, వేఁడిపాల్ మొద లొకప్పుడు ముట్టిన మూతి గాల్చినం,
గొంచక పిల్లి తాగెడు నె గొబ్బున జల్లనిపాలు? మిత్రుఁడా.

ఉ. దొంగను బట్టుకొంట కొకదొంగ యె కా వలెఁ; గాన నట్టివా
టం గపటస్వభావమునఁ దక్కులు సేయక నెగ్గ నేరఁ; డే
భంగి నవన్, విదూరజనిభంబులు గ్రుడ్లను మోడ్చి, మానిశే
వం గయికోక యాఖువులఁ బట్టునె బావురుగాఁడు? మిత్రుఁడా. 68

ఉ. పలువుర క్షేమవృద్ధులకు భంగముఁ దెచ్చెడులోకకంటకున్
మెలఁకువ నెట్టు లైనఁ బుడమిం గడతేర్చుట నీతి; యె ట్లనం,
బొలమున నున్న పన్నగరిమొక్కలకుం దనవామరంబునన్
సిలుఁగులు దెచ్చుతుమ్మలను జెల్కరె గొడ్డటిచేత? మిత్రుఁడా. 69

చ. పలువ లొకప్పుడుం దనకుఁ బట్టెఁడు కూడిడఁ ట్టివారిపాం
దలఁకును బోక, తిన్నయిలు నాశ మొనర్పఁగఁ జూతు రే మొకో?

---

*ట్లంచన, జాలసంచకిత మైనవిసారకులంబు, నీలమే
ఘాంచితబింబముం గని భయంపడి మిట్టవె నీళ్ల? మిత్రుఁడా.

యొంకలు వెండి పైడి గలయిండ్లు లనేకము లుండ, మెందుఁ గాఁ
గలుఁగులు దబ్బివ్వ వంటయిలు గాదెలు పాడఁ జేయు; మిత్రుఁడా.

---

## ఆపత్సంపదలు.

చ. కలిమియు లేమి సౌఖ్యము ను కష్టము నీయవి యెల్లవారికిం
గలుగును గాలభేదమునఁ; గాదు సుమీ తిర మిందు నొక్కఁడున్;
జలధిపరీత మౌ ధరణి చక్రమునం గలసర్వజంతుజా
తులకు సహస్రకళ్ వెలుఁగు నస్తమయమ్ముట లేదె? మిత్రుఁడా. 7

చ. ఇలఁ దనుయాత్ర సల్పునరుఁ డెప్పుడు నప్పటినైజసంపదం
దలఁచుక పొంగ టాపద మనంబున నెంచుక క్షుంగ టొప్పు; ది
మ్మృల భ్రమియించు చక్రమున నున్ బయి నుండిన యాకు క్రింది దౌ,
దొలుతను గ్రింది దౌ పరము, తోడనె మీఁదికి నచ్చు; మిత్రుఁడా. 7

ఉ. సంపదయందుఁ బొంగు మ, గృశత్వము నాపదయందుఁ, బోఁడు స
న్నంపుజనంబులందు; ఘనసంగు వికారము బోఁప దెప్పుడున్;
బెం పయి వర్షకాలమున వేసవి యందు దను గంట నుంటు; చిం
తింపఁగ నంబురాశి యొకతీరున నే సత ముండు? మిత్రుఁడా.

ఉ. సంపద వచ్చినం, బరవసంబున నీతులు గట్టు మీఱి పిం
సింపఁగ నఁ జూతు రొంకులను; జేయరు సూ ఘను లిట్టిధంబునన్;
ముంప దె గాఢ్రిమనముల్ నలుపుపొల్లునఁ బొల్పుఁరి నేఁడు? సంద్రమో,
గుంపులు గుంపులై నదులు కూడిన, దాఁటదు వేల; మిత్రుఁడా.

ఉ. ఆపద రాఁ గలప్పుడు మహాంబుధి నుండినఁ, గాన నున్న, భూ
స్థాపన మొందినన్, గుహల దాఁగినఁ; దప్పక వచ్చి తీరెడున్;
జేఁపలతండముల్, సొగసుటింకలగుంపులుఁ, గూర్మసంఘముల్,
ద్వీపిసమూహముల్, పొరయ వే భయ మయ్యెయి చోట్ల? మిత్రుఁ

తనకు నదృష్ట మొగడియదాఁకను బాగుగ నుండు, నంతదాఁ
కను జద లంటు; నాపదలు గల్గవు; పిమ్మటఁ గూలఁ గాఁ బడున్;
బొనరచినట్టి కాగితపుబుట్టలు దీపము వెల్గునంతకున్
జనుఁ గద యూర్ధ్వరంబున? ననంతర మేమి మగు నయ్యా? మిత్రుఁడా. 76

జనుల కదృష్టకాలమున సర్వము దానికదే లభించెడిన్?
గన దురదృష్టవేళల నొకంతను జేకుఱ; దున్న దూడెడిన్;
యని నవకారునం బ్రిసవపల్లవపక్వఫలంబు లొందు; నె
ర్వునిచిన, నాఁడు రాలుతటి నొందు నె, మోద్వ్యము గాక? మిత్రుఁడా.

అగయఁగ సర్వశూన్యుఁడు మహోన్నతుఁ డగున్ క్షణంబులో;
నారుఢనికండు పేద యగు నొక్క నిమేషమాత్రన; నెట్లు నా,
నరుడుగ రిత్త దోఁచెడునుమాబిల మట్టె మొగుళ్ళచే నిరం
తర మగు; మబ్బు లున్నది పడంపడి వట్టిది గాదె? మిత్రుఁడా. 78

ఇలపయి మేలుగ నీ ననుభవించెడు వేళ హఠాత్తుగా నవ
స్థలు విపరీతముల్ దోఁపఁగఁ, దాల్ప భరం; బయినం గ్రిమంబునన్
జాలుకన గావె? వెల్తురునఁ జొచ్చుచు నీడకు, నీడ నుండుచున్
వెలుఁగునకుం జటుక్కు నను వశ్యఁ గనల్ గను నెట్టు? మిత్రుఁడా. 79

ఘనసుఖదుఃఖముల్ సమముగా లభియించుచు నున్న, సౌఖ్యపుం
దినములు వేగినట్లు కడ తేఱవు కష్టదినంబు లెంతకున్;
గనదురుచంద్రికోజ్జ్వలదకాంతిమనోహరపూర్వపక్షయా
మినులనలెం దమిస్రలు గమించుట లేదు గదయ్యా? మిత్రుఁడా. 80

తొలుతటికంటె మీఱు గుణదోషము లెక్కటునందు సాధ్వసా
ధుల; కటు గాన నే యశము దుర్యశ మందున హెచ్చు వారికిన్;
వలను గఁ గాల్పుచే నగరువత్తికినిం బొగచుట్టకుం, బరి
మళమును గంపు హెచ్చి సభ మాన్యత దూష్యత దేవె? మిత్రుఁడా. 81

ఉ. పేదలఁ గాన లేఁడు సుమి పెద్దయు సంపదలోన నల్పుఁ; డే
మాదిరి నైన నక్కలిమి మాసిన నప్పుడు గాంచుఁ గాని; యోఁ
గా? దినవాథు పెన్వెలుఁగు గల్గఁగఁ జుక్కలఁ బావ గాంచు నే
యోదటఁ, జిమ్మచీఁకటి రయమ్మునఁ గ్రమ్మినఁ గాక? మిత్రుఁడా.

ఉ. పేద నటంచు నోరఁ దన ప్రేవులు సూపిన, హీనుఁ డంచు వ
ల్పాదరణం బొనర్తు; రనయంబు గభీరతఁ బూన లెస్స యోఁ;
బాదసమీపమందుఁ బడి శ్వానము నోరును కుక్షి సూపినన్,
మేదిని గంజి వోయుదురు; మెండుగ నేనిక కీరె? మిత్రుఁడా.

ఉ. స్వాంతములోన, లేమి గలయప్పుడు చింతల కేమి వింత? య
త్యంతము కల్మి యున్నపుడు నవ్వి జనింపక మాన నెట్టులో;
ధ్వాంతము, వెల్గు లేనితటి దట్టముగాఁ గనిపించు టబ్రమే?
కాంతి గనుప్పుడుం జెడక కన్పడు నీడల పేర; మిత్రుఁడా.

చ. ఇడుమల నెగ్గు లాడెదరు హింసగు లందు వివేకహీను లై,
యిడుములె లేక యున్నఁ, దము రెట్టు లెఱింగెదరో సుఖస్థితుల్?
మిడిమిడియెండలో నడచి మిక్కిలి డస్సినఁ గాక శక్యమే,
పుడమిని జెట్లనీడసుఖముల్ జలసౌఖ్య మెఱుంగ? మిత్రుఁడా.

చ. ఎవనికి నెట్టివృత్తి ఘటియించును మే లదె కీడు దెచ్చెడున్;
భువి ఘనవృత్తిఁ జేద్యడినఁ బొందఁడు నింద్యను; లాఁతి నొందెడు
దివి శశి వృద్ధియున్ క్షయముఁ దిమ్మరుమం గను, నింద్యుఁ డా
నవు మెయి కుట్టి రూప ఱెడునల్లి సడిం బడుఁ గాని? మిత్రుఁడా

చ. ఒకరికి దేనిమూలమున సర్వని లాభము గల్గుచుండు, వే
ఱొకరికి దాన నే మిగుల నొప్పమి యొప్పతిలుం; బయిర్లఁ బ
చ్చిక హిమబిందుబృందములచేఁ గని గంపక సుందరం బగున్;
జకచక లాడుచూతజలజంబులడంబు లడంగు; మిత్రుఁడా.

వెరవులు వేయి యైనఁ బృథివిం దొలఁగించు నె దుర్విపత్పరం
పరలు, జగత్ప్రదీపకునపారకృపారసపూరసత్కటా
క్షరుచులు పర్వ కున్న? గుమిగా మిణుమిణ్కని గ్రాల్మిడుంగుఱుం
బురువులచేతఁ జీఁకటులు పోవు నె వెన్నెల రేక? మిత్రుఁడా. 88

## ధనము.

రొక్కము గల్గువాని కితరుండును సేవ యొనర్చుఁ గూళకున్;
బక్కను సాధు వైనఁ దనబంధుఁడు గూడను సేవఁగించెడున్;
జక్కఁగ మేపుఁ బాఁడి గలవన్నను బందెలదొడ్డికాపరిన్;
మిక్కిలి గంగిగో వయిన మేపు నె వంజను గాఁపు? మిత్రుఁడా 89

ఫలము నగణ్య మీయఁ గలభవ్యపదార్థ మొకండు గల్గినన్,
ఫల పడ లేదు పేద కడ, భాగ్యము గల్గినవానికిం బలెన్;
బలమునఁ జేసి దున్నక య పండెడుమాన్యపుఁగొండ్రి యుండినన్,
హాలికుఁడు విత్తు లేనియతఁ డైన ఫలించు నటయ్య? మిత్రుఁడా. 90

న్యాయసమార్జితం బగుధనం బను వైన, ముదంబు పెద్ద; య
న్యాయపుసొమ్ము దెంత యయినన్, సుఖ మీయమి కా కపాయమున్
జేయును; నేల రాల్చి క్రాలుచుఁ జీమ గడించి భుజించు పోయి గా;
రాయిడి నెల్క నెమ్ములు సారంగముఁ జేర్చి నశించు; మిత్రుఁడా 91

సరసము లైనగ్రంథములసార మెఱుంగఁగ లేనికుత్సలున్
సిరి గలవారిఁ జేసి, బుధసింహులఁ జేయఁడు దైవ మే మొకో;
ముఱిగెడు పేఁడలోఁ బొరలుపుర్వులతోఁ గను వెల్గు దోఁచు; బం
ధురసుమగంధలోలు మగుతుమ్మెదకుం గన రాదు; మిత్రుఁడా; 9

పాముపరు లైనవారు తముఁ బోషణ చేసికొనంగ నేర్తు రా
పదలను; దూబలుల్ పడెడుపాటులు మున్మను చెప్పి తీఱు నే;

యుదకము సేకరించుకొని యుష్ట్రి మెడాఁ బిపాసఁ బాసెడున్;
మదకరి చల్లు లాడుకొని మానుదునుం గీ యని గార్చు; మిత్రుఁడా.

చ. తనధన మైన, దా ననుచితంపువ్యయంబును జేయు చుండినన్,
గని మహనీయు లోర్వ; రది కాఁ దని గట్టిగ మందలింతు; రె
ట్లన, మధురంబు లౌజలము లన్నియుఁ దోయధిపాలు సేయఁ జూ
చిననది కడ్డమై మరలఁ జేయ దె చేలకుఁ గట్ట? మిత్రుఁడా.

ఉ. దాతలు భోక్తలుం బరగుధన్యులు; సర్వము నస్థిరం బె యీ
భూతలమందు; నేది యెటు పోవు నొ కానఁగ నేర రెవ్వరున్;
దాఁతురు మేలికప్పురపుదండలు పెట్టెలఁ; గొన్ని నాళ్ళకుం
జూతురు వానిదారము లె; పోద్యమె యర్థము పోక? మిత్రుఁడా.

ఉ. క్లేశము, త్యాగభోగములు లేనిధనంబున నార్జనాదులన్;
లేశము గొప్పవచ్చెదను లే; కుడిఁ దెచ్చెదుఁ బెన్వినాశమున్;
గాశితకుండలంబులను గర్ణము కాసను మోసిమోసి, యా
రా! శితకర్త్రం దెగి ధరం బడుఁ దీర్ఘములౌగు; మిత్రుఁడా.

ఉ. విత్తము తా గడించి పడ వేసిన నే మగు? నింటిలో నఘా
గర్త్త య యున్నచో, నది వశావశ్యలై నశియించి పోయెడుం
బోత్తిగ; నెట్లనా, నడుగు వోయినకుండను మంచినీళ్ళు దా
నెత్తుక వచ్చి పోసినను నే మగునో పరికింపు; మిత్రుఁడా.

చ. కలిగినవారి లేవడిని గాసిలువార లె కంద్రు; గాని లే
ముల దురపిల్లుమానుసులమోములు జూడరు పో ధనోన్మదుల్;
వెలుఁగున నున్నమానవుల వీక్షణ సేయుదు రంధకారవం
దలిజను; లట్లు గాంచరు గదా నటె వీరిని వారు? మిత్రుఁడా.

ఉ. సొమ్మొకచోట నుండ నొకచో నవమానము గల్గి, పేర్చుగ
ర్వమ్ము మనఁ జెన్నఁటుల్ నిరపరాధుల కెగ్గొనరించు చుండ్రు; కా

కష్టములు, తాము దాఁచు నెరకప్పున వే యొకపెండ్లికిం దా
నిష్టుల నుండ, దానికయి యీడ్వ వె వట్టివి పట్టి? మిత్రుఁడా, 99

సమయము వచ్చినం దనవశమ్మున నున్న ధనంబు, నొరికిన్
నెవ్వరికైన విద్యయును నేరుమ నక్కఱ దీర్ప నమ్మ; కూ
పమునను గల్గునీళ్ళవలె వారిధరంబున నున్ననీరు లే
క్రమమున మంచియక్కఱకు గాఁ గలవో పరికింపు; మిత్రుఁడా. 100

ధనము గలంతమాత్రమునకుం దన్నఖిలప్రజలున్ సుఖస్థుల్
ఘనము గఁ జేయఁ జాలదు; రిపు గాంచ వలెన్ ధనికుల్ వివేకులై;
మనుజులు డెంకదొక్కలకు మామిడిపండ్లఁ బిసుఁగు చుండరో? తీ
యనిరస మంత పిండుకొని యావలఁ ద్రోవ రె వాని? మిత్రుఁడా. 101

కనకమువల్లఁ గల్గెడు సుఖంబునకంటెను దుఃఖమే ఘన;
బనిశము మోద మొందు నగుఁ డక్కఱ కుండినఁ దృప్తి నొందినన్;
గనగురుచిప్రపించమున గాలుమయోగము లేమి సౌఖ్యముం
గనియెడు లాఁతిపుల్గమికన్నను, దుఃఖమె కాక? మిత్రుఁడా. 102

---

## దాతృత్వము

తమ కని దాఁచుకొన్నది వృథా ధన మింటను బూఁజు గట్టు? లో
కమునకు మేలు గోరి యిడఁ గా నది యోగ్యము శ్లాఘనీయ మౌ;
నమితము కంధి దాఁచుకొనునంబువు, నీలము త్యాగ మయ్యె; మే
ఘములకు నిచ్చినట్టిది, యకల్మషమున్ మధురంబు? మిత్రుఁడా. 103

పాత్రమునందుఁ బడ్డ దనపాయతఁ గోటిగుణంబు వృద్ధి యౌ;
ధాత్రి నపాత్రమం దది మొదల్ చెడి పోవును; నిశ్చయంబు; సు
క్షేత్రమునందుఁ జల్లుకొనిచేరెఁడువిత్తులు గోనెఁ డయ్యెడున్;
జిత్రమె? చౌటి నేల నవి చేయును బొందుట లేదె; మిత్రుఁడా. 104

చ. అలఁతి గ నిచ్చినం, బరమహర్షము నొందెడుఁ గాని పేద, దాఁ
గలిగిన దంత యిచ్చినను, గల్గినవాఁ డెపు డూఱడిల్లఁ; డీ
యిల జలదంబు కొంతజల మిచ్చిన, సస్యము లుల్లసిల్లెడున్;
జలనిధి సర్వముం గొని యయుఁ జాలక మ్రోఁగును గాదె? మిత్రుఁడా.

చ. మతి నెఱదాత లెప్పుడును మంచిని దాఁచుక చెడ్డ వొండ్లకున్
వితరణ మీఁ దలంపక వివేకఘనం దగినట్లొనర్తు రాఁ;
బ్రితిధరణీజరాజమును బక్వఫలంబులు గాయ లుండఁ, భూ
క్షతికెని బండ్లు లిచ్చుట నిసర్గగుణం బగుఁ గాదె; మిత్రుఁడా. 1(

చ. జను లసమర్థులైన నిడ, సత్కృతి నింపు గ నాదరించినన్,
మన మతిహర్ష మొందు, నని మాని యొసంగినఁ గాదు మోద; మె
ట్లన, నెలమావినీడను బికాలపనంబున సేద దేఱ దే?
పునుకను దాడు పెద్దఫలముం బడ వేయు న దేల? మిత్రుఁడా. 1(

చ. పదగక యర్థి కిచ్చెదరు పాడిమెయిం గలవాఁడు; లేనిచోఁ,
గొదుకక బిడ్డ నే చెదరఁ గొట్టుదు రూరక బాధ పెట్టినన్;
బొఁదుఁగున బాలు గల్గ నిడుఁ బొందు గ నేరికి నైన; లేనిచోఁ,
మొదవులు వానిదూడల నె మూతులు వీ్ప్రలఁ గఁ దన్ను; మిత్రుఁడా.1

ఉ. తా నిడు టీయ కుండుటయుఁ దక్షిణ మే సుజనుండు దెల్పెడిన్;
హీనుడు త్రిప్పిత్రిప్పి విసిగించి తృణమ్ము నొసంగ కంపెడున్;
గాన ముకాల వేసఁగిని గ్రిక్కున నిచ్చియొ యీకొ పంపు రాఁ
గా నె మనుం; గెడార యటు గా; దడియాసలఁ బెట్టు; మిత్రుఁడా

ఉ. ఇయ్యఁగ మంచుఁ జెప్పినను, హీనుఁ డొసంగక మానుఁ; గాని తా
నియ్యక పోఁడు దాత, యొవ రెన్నివిధంబుల నడ్డగించినన్;
గయ్యా, కళింగ యడ్డ పడఁ గిట్టు వడుం, బొల మొండఁ బాఱినం;
బయ్యెర గెంటు చుండినను, బం దగు నే జలదంబు? మిత్రుఁడా.

——o——

## ఋణము.

అవసర మెంతవారలకు నైనను వచ్చును; గావ మంచిమా
నవుఁ డని తోఁచె నేని యయు ఋణ మ్మొసఁగన్ వలె శంకఁ దక్కి; స
త్తువ మెయి నెల్లయోషధితతుల్ మొలపించున దయ్యు, గుల్ల యై
యవని యపేక్ష సేయ నెరు వ్వా మె యీయక పోవ? మిత్రుఁడా.

అడుగక యున్న నున్న యగు న; ప్పటు గావున మంచిమాటలన్
గడువునఁ దప్ప కుండ నడుగన్ వలెఁ జుమ్ము ఋణ; మ్మ దెట్లనన్,
దొడుకుల రేపు మా పరసి దోహనముం బొనరింప కుండినన్,
జెడి యొక కొన్నివారములఁ జేఁపు నశించును గా దె; మిత్రుఁడా.

పగ తెగు లప్పు తప్పు నివి పా్రిత్తము లైనను, వేగ నేమి యున్
మిగులక యుండఁ దీర్చుట యె మే; లటు సేయనిచో నపాయ మౌ;
రగిలెడునగ్నిహోత్రమును రాఁజక యుండఁగ నీటిధారలన్
దగ మొద లంట నార్పమిఁ బదంపడి యే మగు నయ్య; మిత్రుఁడా.

అప్పులు తాము పుచ్చుకొనినట్టు లె క్రమ్మఱ నీయఁగా వలెన్?
దప్పిన వీడు నొక్క ఋణదాత, గొనుం గద కక్కసంబునన్?
దిప్పలు నీకు లన్ని తెకతేరఁగఁ బిల్చి, మొఱంగఁ జూచుఁ గా
కొప్పరికించు నే ఖరమయూఖుఁడు నైకొన కుండఁ? మిత్రుఁడా,

ఇతరులసొమ్ము లోభి హరియించి యొసంగనిచోఁ ద త్తి స
మ్మతిఁ దిరుగం గ నీ కిడినమానిసి కుత్తుక కుచ్చుపోసి యు
ద్ధతిఁ గొనుఁ జుమ్మి; యవాధమున చాఁచినపాలను గ్రోలునట్టులం
బితుకఁ డె దోగ్ధ కుద్ధుఁ డయి పెన్మెడకొంకులు గట్టి? మిత్రుఁడా.

వడ్డికి నాస పుట్టి చెడువానికి విత్తము నప్పు వెట్టినన్,
వడ్డికిఁ జేటె కాక సలువట్టము గూడను సంభవించెడున్;
గడ్డి యుఁ జొప్ప యుం జనుప కాఁడలుఁ దౌడును జిట్టుఁ బొట్టుఁ దా
బిడ్డను గొడ్డుటావునకు నే మగు నో పరికింప; మిత్రుఁడా.

## లోభిత్వము

చ. అనద నటంచు నో ర్దెఱచె నా, నిజు పేదకు నున్న యంతలో
వనఘుఁడు వెట్ట కుండఁ; డకటా కలుషాత్ముఁడు లోభి వెట్టు నే?
కనుఁగవ ఱెప్పలం దెఱచి కనొన, వెల్తురు దాఁచుకోదు గా,
తనకడ నున్నవస్తువులఁ; దాఁ దిమిరంబు ను బోలె మిత్రుఁడా. 117

ఉ. ప్రాణముకంటెఁ దీ పనుచుఁ బాముఁ డర్థముకై పెనంగుచుం,
బ్రాణము నర్థము న్విడుముఁ; బ్రాజ్ఞుఁడు తత్త్వపరీక్షచర్యుఁ; డా
క్షీణమధుద్రవం బిడక జీవము నిచ్చును ముందు దంశక
శ్రేణి; పెరన్ ధనాజము త్యజించి గడింప దె వాఁడి? మిత్రుఁడా. 118

ఉ. అక్కఱతో గడించి కడుపార భుజింపక దాఁచి, లుబ్ధకుల్
మిక్కిలి దుఃఖ మొందెదరు మీఁదను; భోగు లె మోదభాగు లౌ;
మక్కువఁ దారిన లేక మధుమక్షిక తేనెను బుట్టఁ గూర్చి తా
నుర్కు నెలుంగు గ్రక్కఁగొనఁ; జూడు ఖలిప్రకరంబు; మిత్రుఁడా

చ. విను కఠినుల్ మృదూక్తులను వేఁడెడునర్థుల కీక, తాను నం
దినక ధనంబు దాఁచినను, దెక్కలికా అది దక్క నిత్తు రే?
చనవునఁ బల్కుచిల్కల కొసంగి మెసంగక, నారికేళముల్
పెనుచును లోనఁ గొబ్బెరను; బేయుఱుతల్ దిన కు న్నె? మిత్రుఁడా.

ఉ. తా నొక కాసు గ వ్వైపు దానము సేయఁ డొసంగు నోటికిం
బూనిక నడ్డ మౌఁ, దనకుఁబుట్టి మునింగినయట్లు లోభి; యాఁ;
గానల ముండ్లతుప్ప లొకకాలమునందు ఫలింప కుండి యున్
మానుగఁ బండు లిచ్చుపలుమాఁకుల కడ్డము రావె? మిత్రుఁడా. 121

చ, ప్రజలకుఁ బంచి పెట్టుటకు ద్రవ్యము దాతె యొసంగ, లోభి బే
రజ మది తాన మ్రింగును దురాశ; మహోన్నతుఁ డట్లు సేయునే·

సుజలము మేఘముల్ వలయుచోట్లకుఁ బంపుట కీయ, సైకత
వ్రజముహరించుఁ; గాలి కుధరంబు హరించు నటయ్య? మిత్రుఁడా.

ఉ. అవసర మాన్యాయంబునను నైనను బ్రాణము లొప్ప కున్నమా
నవునను లాభ మబ్బ; దతినష్టము తప్పక వచ్చు నమ్ముమా;
తవిలినయాసతో మన మెఱుఁగ వచ్చును సర్వ మంచుఁ గ్రొ
వ్వు వికువ కున్న, నా వెలుగు ముంగఁగఁ జేపెడునయ్య? మిత్రుఁడా.

---

## ఆశ్రయము.

చ. ఘనులను నాశ్రయించినను గష్టము లన్నియుఁ గట్టె యెక్కు; హా!
దినదినగండ మల్పులను దీనత మానవు లాశ్రయించినన్;
వననిధిలోనిమత్స్యములు వచ్చు చుండ వె నిర్భయంబు గా?
జైన వెలువద్ద దాఁగ నకొంచ వె గుంటలమీలు? మిత్రుఁడా. 125

చ. అనయము సౌఖ్య పెట్టుఁ దనయాశ్రితులన్ ఘనుఁ డైన, నీచుఁ డో,
తన కదె సందడించు మదంబున వారల నేఁచుఁ బూను; నె
ట్లన, హిమశుభ్రవర్ష సమయంబున మూఁడిటఁ బాంథులన్ వటం
బనువుగఁ బ్రోచుఁ; దుమ్మదలియం జనఁ గొట్టులు గొట్టు? మిత్రుఁడా.

ఉ. కొంచెము కాలుసేతులను గూడఁగఁ దీసికొనం గశక్తిగా
న్పించినదాఁకఁ గాకవుల నీచునకున్ ఘనుఁ డెట్లు లోఁబడున్?
గాంచఁగ గుల్లలోనఁ గలకాల మడంగు నె పిల్ల? సాంగమై
చంచువ దానిఁ జక్కఁడఁచి చప్పున వెప్పల రాదె? మిత్రుఁడా. 126

ఉ. దారుణిఁ బూజ్య లౌజనుల దక్కువ వారిని నాశ్రయించినన్,
గౌరవహాని లేదు; తమ కార్యపుఁగక్కుఱితిం దటస్థ మౌ;
సారతరంబు లైనయలసానలఁ దీఁటెనజాతిరత్నముల్,
దారము నాశ్రయింప, వెల తగ్గ నె యించుక యైన? మిత్రుఁడా.

చ. తనకడ నున్న సేవకులదార్ఢ్య మెఱుంగఁ గ లేక, యందఱం
బనిగొను నొక్కతీరున నె పాపపునీచు వివేకహీనతన్;
గనుఁగొనఁ జాకివానికడ గాడిద గుఱ్ఱముఁ గూడ నుండినన్,
గొన మెఱుఁగఁడు; రెంటిపయి గుడ్డలమూట లె వేయు; మిత్రుఁడా.

చ. మనుజుఁడు క్రిందివారిఁ జనుమాన మొనర్చక యాశ్రయింప కుం
డినఁ బయివారమన్నన గడింపఁ గ లేఁ, డతఁ డెట్టిఁ డయ్యా; నె
ల్లన, నల విడ్డకంపలను నల్లికబిల్లికఁ జుట్టుకొంచు నొ
ప్పనియొడఁ బాదులో మొలక వంచెరి యెక్కు నటయ్యా? మిత్రుఁడా.

ఉ. సమ్ముఖవర్తి యౌని కని చాల నశక్తుని నాశ్రయింప వ్య
ర్థమ్ముగు; దౌల నుండినను దక్షుఁ గన న్వలె; మేఁకయుత్తమాం
గమ్ము సమీపమందుఁ గలకంఠకుచమ్ములఁ బట్టి వ్రేలినం,
గుమ్ములు వచ్చు నయ్యా, పొదుఁగుంజను లిచ్చును గాక? మిత్రుఁడా.

చ. చెడి పరభాగ్యజీవనము సేయు ఘనుం డర పచ్చి; నీ చదే
కడు సుఖగౌరవావహము గా నెపు డెంచుక పొంగు సిగ్గు లే;
కడవికిఁ బాసి వచ్చి కృశమై యుపలాలన సేయఁ జేయఁ గాఁ,
గడి గడె కెత్తు హస్తి; శునకం బదె మాచుక పొంగు; మిత్రుఁడా.

చ, ఒకళుల పెట్టుపోఁతలకు నొగ్గుట దోసిలి పౌరుషం బె, ర
క్షకుఁ డిడఁ గాలునేతు? లతిగర్హ్యము యాచన మానవాళికిన్;
ప్రకటము, పాలుమాలక పరిభాతమునం బెనుబారు లై పిపీ
లికలు ను నూకగింజల గడించుట లేదె స్వశక్తి? మిత్రుఁడా. 132

రాజు

ఉ. రాజొకఁ డుండు కుండినను, రాష్ట్రమునందు ననేకదోషముల్
వే జని యుంచు; దానఁ బృథివీపర్జ కాపద సంభవించెడున్;
దేజము గల్గునట్టి హిమదీధితి లేని యమాసరాత్రిఁ,
భూజను లెన్ని యాపదలఁ బొందెద రో పరికింపు; మిత్రుఁడా. 133

ఉ. గా జెటువంటివాఁ డతని రాష్ట్రము నట్టిద యౌను; గావునన్
రా జగువాఁడు సర్వగుణయుక్తుఁడు గావలె ధర్మనద్ధికిన్;
దేజిలుచున్న నాశ్మ కడు తిన్నని దొచును, నిందియంబు లే
యోజను బాపకార్యముల నూరక చేసెడు నయ్యొ? మిత్రుఁడా. 134

చ. సరసులు చాలఁ జేరుదురు సద్గుణముల్ గలవానియొద్ద; న
క్కరణి ని దుష్టునొద్దఁ బలుగాకులు సేరుదు; రుట్లులన్న చోఁ,
బగభృశ కీరశారికలు బంధగముల్ దగ చుండు నందనో
త్కరముల; వల్లకాళ్లకడఁ గాకులు గద్దలు గావె? మిత్రుఁడా. 135

చ. నరులను నేలువాఁడు కరుణారసపూరితుఁడుం బ్రతాపసం
భరితుఁడు నౌచు నుండవలె; భాసిలఁ డుం దొకదాన నెన్నఁడున్?
కరము మధుద్రవంబు సరఘాతతి గూడను నుంటచేఁ గదా
పెరుఁగును దేనెపట్టునెడఁ బ్రీతియు భీతియుఁ గూడ; మిత్రుఁడా. 136

ఉ. వీసర వోవభీరమున వెల్గెడు నేనికి జంపు; గాని పై
వేసము వేసికొన్న పృథివీభుజునిం బజ లక్ష్య పెట్టు నే?
రోసము గల్గుతాఁచును నరుల్ గనఁగొన్న భయంబుఁ బొందరే?
కూస మొలక్ష్యపెట్టుచును గ్రుమ్మలు చుందురు గాని? మిత్రుఁడా.

ఉ. అర యనుచుం బ్రతాపమున నందఱయొద్దను బుచ్చుకొన్న సొ
మ్మరసి జనోపయోగమునకై వ్యయ పెట్టుట నీతిభర్త; భా
స్కరుఁడు సహస్రధా భువిరసంబు గ్రహించి, హరింపఁ జూచు నే?
వరుసను వానలిచ్చి సదుపాయముఁ జేయును గాని? మిత్రుఁడా.

ఉ. విక్రమశాలి యయ్యుఁ బృథివిం బతి యేలఁగ లేఁడు రాజ్యతం
త్రక్రమవేది మంత్రి వినాగ; న దెవ్వరు పూనఁగా వలెం;
జక్రము నిల్పఁగా నిరుసు చాలు నె యొక్కఁడు నక్కఁడయ్యుఁ; ద
త్ప్రక్రియ కొక్కకీలకము పార్శ్వమున న్నిల కున్న? మిత్రుఁడా.

ఉ. కొట్టుచుఁ దిట్టు చెల్లప్పుడుఁ గ్రూరత నూపుట వట్టిపిచ్చి; తో
డి ట్టటు కంటఁ బంట బెదరించుచు సౌమ్యత నేల మేలు ను;
వ్వెత్తులు పృథ్వి దాఁ బరమళించుఁ బ్రచండమరీచి తేజునన్;
గట్టిగ వెట్టగా నగును గాక; ఘనం బెటు సేయు? మిత్రుఁడా.

చ. సరసుఁడు నెమ్మి వాంఛితము నొసంగెను సత్ప్రభువర్తి యయ్యు, ని
ద్ధరఁ బ్రభు వాది నైజము ప్రతాపము నూపుట; వెన్క శాంతుఁడౌఁ;
గరము ను దొల్త గర్జించుఁ గారణ మౌఁ గద యుక్కకున్ ఘనుం;
డురుజలధారలం బిడప నొప్పుచుఁ జల్లన గాఁడె? మిత్రుఁడా. 241

చ. ప్రజలకుఁ గల్గుబాధ తనబాధగ నెంచి నివారణంబు చే
గ జరప కున్న నేఁ, డది యా కారణ మయ్యెడు నాత్మహానికిన్;
నిజము, దురామయంబుల మునింగిన మేనికి సత్వరంబ దే
హి జగతి వైద్య మీయక యుపేక్ష యొనర్చిన మేలె? మిత్రుఁడా.

ఉ. పాడికి నెల్లవారలు ను బద్ధులు గావలెఁ; గా కహంకృతిన్
గీ డొనరింపఁ జూచినను గెల్చునె బల్మిదు దుర్బలుం డిలన్?
గూఁడులు సన్ని పిచ్చుకలు గ్రుడ్డులు పెట్టుక యుండ, నక్కటా!
గోడుపడం గ జోడుపులుఁగుల్, భుజగం బవి మ్రింగు: మిత్రుఁడా.

చ. జనపతి న్యాయదండనము సల్పక మిక్కిలి క్రౌర్య మూనినన్,
జను లతిసాధు లయ్యుఁ దమ శౌర్యము నూపక యాజ్ఞ నిల్తు రే?
యనలము సన్నపుస్నెకల నట్టిటు గాఁపక పెద్దవేఁడి చూ
పినను, బయస్సు పైఁ బడక భీతిలి యుండు నె కుండ? మిత్రుఁడా.

ఉ. ఎల్లరజీవితంబులను నెక్కటి గావఁగఁ బూనుకొన్నభూ
వల్లభుమానసంబునకు స్వస్థత యొన్నఁటి కైనఁ గల్గు నే?
చల్లన యౌచు నేఁ డగుచు సత్వర మౌచును మంద మౌచు, ని
ట్లెల్లపుడు న్మరుత్తు చలియించుచు నుండును గాదె? మిత్రుఁడా.

చ. జనపతియాజ్ఞ యత్యధికచండ మగున్ భటునుండి వచ్చినన్;
గనఁగొన నంతతీక్ష్ణ మది గాదు నుమీ పతినుండి వచ్చినన్;
వినుఁ, రవిరశ్మి బింబమున వెల్వడి వేఁడిగ మాత్రముండు; న
య్యినమణినుండి వచ్చిన, దహింప దె దేనిని నైన? మిత్రుఁడా.

చ. నరపతి దా సమర్థుఁ డయినం జనవాని వలంతి నేని యున్
బరునకుఁ జిక్కి నిచ్చిన సహాయము వచ్చుట నిశ్చయంబు; బం
గరు రజతంబు రత్నములు గల్గి, దృఢం బగుభూధరంబు లు
ప్పరి గునపంబు పట్టుకొని వచ్చిన నే మగు నయ్య? మిత్రుఁడా.

చ. తమ కధికారి యౌనతనిదార్ఢ్యము తన్ముఖదర్శనాదికృ
త్యముల నెఱింగి భృత్యజన మాతనికి దగినట్టు లుండు; న
శ్వము తనపైని స్వారి సలుపం జనుదెంచిన రౌతుకౌశలిన్
నిమిషములో గ్రహించి, చను నేతవినీతినిబట్టి; మిత్రుఁడా. 148

చ. బెడిదము లౌను చుంచినను బెట్టెదు నేలికఁ గూర్మి సేవకుల్
విడువరు; పెట్టకున్నతఱి వీడుదు రేమి యయు వాడ కుండినన్;
బిడుగులు రాల్చిన న్విడిచి పెట్టవు చాతకముల్ ఘనాఘనం;
బెడఁదల నిచ్చగించునె భజింప శరచ్ఛరదంబు? మిత్రుఁడా.

చ. కొలఁది యొ గొప్పయో తమకుఁ గూడమ మే లగు నన్నకార్యముల్
బలె నిల పట్టిపెట్టిపనులం బొనరింపరు నుమ్మి యెవ్వరున్;
నిలయమువంక కన్న గమనించును వార్వము వాయువేగ మై,
యలసట నొంది యున్; బయన మన్న గమించు నె యట్లు మిత్రుఁడా.

చ. సులభము గా లభించు నని చుల్కనివానిని సంగ్రహించినం
గలుగును బెక్కునష్టములు; కైకొనఁ గా వలె మంచివానినే;
కలుకుచు నోలి తక్కు వని గుడ్డిపడంతుకఁ బెండ్లి యాడినన్
నెల కొకకుమ్మరావ మవనిం బగిలింపక యున్నె; మిత్రుఁడా.

చ. లోలత నాధిపత్య మొకలుబ్ధున కిచ్చిన, హెచ్చు సేయఁగాఁ
జాలఁడు; గాని వీ లయిన, శక్తికొలందిని మాపు రాష్ట్రముల్;
మేలుగఁ గాచి పెంపఁ దగు మేఁకలమందలమీఁద వేఁ్రడు తో
డేలికిఁ బెత్తనం బిడ, వడిం దిగ మ్రింగక యున్నె? మిత్రుఁడా.

చ. పుడమి మహాత్ము లుండఁ దగుపూజ్యపదంబున నీచు నిల్పినం,
గడుఁ బరిహాసపాత్రుఁ డగుఁ; గాని యొనర్పఁ గలం డె తత్క్రియల్
చిలుకలు గోరువంకలు వసింపఁ గఁ గట్టినపంజరంబులోఁ
నిడినను గాకము, న్నగుదు రింతియ కా కెటు పల్కు? మిత్రుఁడా.

చ. ధరఁ బ్రతిభాఢ్యు నుత్తమపదంబున నుంపక నీచపుంబదాం
తరమునఁ ద్రోసినం బ్రభు వవామకుఁడై యతఁ డుండ నేర్చు నే?
వెరవునఁ బాదునం దునిచి పెంపఁగఁ గూడినపిత్తు, పెంటపై
నరయక పాఱ వైచిన, న దక్కుడఁ గప్పుడి యున్నె? మిత్రుఁడా.

చ. ఘనుఁ డితఁ డల్పుఁ డీతఁ డనుజ్ఞానము లే కధికారి నమ్ము నొ
ప్పనివిపరీతపుంటనుల వారికిఁ జెప్పుట గొప్పత ప్పగున్;
జనుఁ డపసవ్యసవ్యకరసంస్మృతి లేక విపర్యయంబు గాఁ
బనులకు వానిఁ జొన్ప, నగుఁబాట్లగచాట్లగుఁ గాదె? మిత్రుఁడా.

ఉ. చిల్లరవారి నెట్లయినఁ జేయఁ గ వచ్చును నొప్పి దోఁచినన్;
జెల్లదు వారలం బలెను జేయఁ గ ముఖ్యుల నారయ న్వలెన్;
గోళ్ళను తీసి వేసినను గోర మె భారము గానిపించినన్?
వేళ్ళను నెట్లు చేయుటకు వీ ల్లెఱుఁగ న్వలెఁ గాని; మిత్రుఁడా.

చ. కర మనుకూలవృత్తిఁ దమకష్టసుఖంబుల కౌజనంబులన్
భర మని వీడిన న్వలయుఁ బట్టున రా; రపు డేమి సేయ నౌఁ;
దెరువున వాన రా నెటు లౌ తేర కుపానహముల్ దొఱంగినన్,
దెరువరి ముండ్లు గండ్లు గల తెన్నున నే మగు నయ్యా? మిత్రుఁడా. 158

ఉ. ఎండకు వాన కోర్చుహితభృత్యుల నేమఱ కుండఁగా వలెం;
బండితులుం బ్రధానులును బంధుపురోహితు లెందఱుండినన్;
దండిగఁ బచ్చకప్పురము తావిహిమాంబులు కజ్జలంబు పూ
లుండిన నే మగు, న్నయనయుగ్మము లెప్పలఁ బాయ? మిత్రుఁడా. 157

ఉ. పోరిన నౌ దొరినో మఱియు భూవరుఁ డేమి యొనర్ప నెంచెనో
యేవిధి నైన మం దొకని కే తెఱఁగింప? ఫలంబు చెల్ప దే?
దైవము మే లొ కీడొ మఱి దా నిఁక నే మొయి నేమి సేయునో
జీవుల కాఫలోదయము చెప్పుట లేదు గదయ్య? మిత్రుఁడా. 159

చ. పగతురు మాసి రంబునఁ నృపాలుఁడు మత్తుఁ నుండ రాదు గా?
జగతిని శ్రేని కెంత జయశాలికి నైనను శత్రు వుండెడున్;
వెనఁగ మొగి జేవుఱింపఁ గను బూర్వగిరిం దినవాథుఁ డెక్కఁ గ్రిం
దగునిరు లుక్కడంప, నది యవ్వల నే చుట లేదె? మిత్రుఁడా. 160

చ. జితుఁ డగు దక్షుఁడుం గొలఁది చేతఁ బరాజ్మతి యైన, జాగరూ
కత వడి వెన్క ముం దరయఁ గల్గినవాఁ డప దైన నోడు నే;
ధృతి సెడి దద్దఱిల్లు నతిధీరుఁడు బాలుఁడు వెన్కఁ గో యనన్,
మతి మఱ పున్న; లేమిని గుమారుఁడు జంకఁడు గాదె? మిత్రుఁడా. 161

---

## నియంత

చ. మగఁటిమి గల్గువారు పలుమానుసు లుండిన నేమి? వారిపైఁ
దగు మొనగాఁడు లేక బలదర్పము సూపఁగ నేర; గట్టులే
యగుఁ గద? తర్జనీపరిభృతు లౌనితరాంగుళు లెన్ని యున్న, లె
స్సగ బొటవ్రేల్ దొఱంగి పని సల్ప సమర్థము లౌనె? మిత్రుఁడా. 162

ఉ. స్థైర్యము ధైర్యముం గడు ప్రతాపము గల్గి ప్రభుండు నిల్చినం,
గార్యము లెట్టివైన నొడికంబుగఁ దద్భటు లాచరింప రే?
యార్యమునంతవాఁ డొకరుఁ డట్లు వెలుంగుటఁ జేసి, మింట దు
ర్వార్యములై గ్రహంబులు నిరంతరముం దిరుగాడు; మిత్రుఁడా. 1

చ. నడిపెడునొక్కఁ డుండుటకతన జనంబు ఫలించు నెట్టులో,
చెడుట యూ నట్టులే పిఱికిచేరికఁ దత్కృషి; వాని నంతు రే?
ఎడివడి వాయుయంత్రమున వచ్చును నీ రొకచక్రశక్తిచే;
నుడుగదె క్రింద గొట్టమున నొక్కఁడె జిల్లియ యున్న; మిత్రుఁడా.

ఉ. సాహసముల్ సమగ్రయు శక్తి గల్గిన నేమి? తగ్గప్రో
త్సాహము లేమిఁ జిన్నపని సైత మొనర్పఁగ లేక వ్యర్థుఁడౌ;
లోహములం గరంచు ననలుం డొకఁ డూఁదిన; నూఁద కున్ననో,
దాహము సేయ లేఁడు పోయిఁ దాపినకట్టెల నైన; మిత్రుఁడా. 1

ఉ. ధీరుఁడు ముందు మార్గమును దీసినపిమ్మట గాలిఁ దూలుని
ష్పౌరుషుఁడుం గడంగు; సులభంబుగఁ జేసినవెన్క నెద్దియున్;
హీరశలాక రత్నమున కేర్పడ రంధ్ర మొనర్ప, దానిలో
దార మెదూఱఁ జాలుఁ; దొలుతం దరిఁ జేరదు గాని; మిత్రుఁడా.

—o—

## సేవకుఁడు.

ఉ. మంచిమనస్సు గల్గు యజమానునియొద్దనె గాని, క్రూరపుం
జంచలబుద్ధి గల్గు ప్రభుసన్నిధి సేవ యొనర్ప రాదు; ఘు
ట్టించిననిద్దపుల్ సరణి నేగును వేగ సురక్షితంబు గాఁ
గంచర; మెవ్విధి న్విషమకాననమందుఁ గమించు? మిత్రుఁడా.

చ. మనుజులు వ్యగ్రమౌ దురభిమానము మానుకొని తారు సేరునా
తని కనువర్తులైన, సుపథంబయి బంధులతో సుఖింతు; రె

ట్లన, నిజదైర్ఘ్య మెంచుకొని యామునఁ దుత్రిళ్ళక, సూచికానువ
ర్తనమున దారముల్ పటముతంతులతో సుఖ మందు; మిత్రుఁడా.

తెలిసి విధాయకక్రియలు తిన్నగఁ జేసిన సేవకుండు మా
టలు పడ కుండుఁ; గాని యకటా వికటంబుగ నన్నఁ జేటగున్;
సులువుగ నాగవాసమునఁ జొచ్చినచో, గడె కెట్టిబన్నముల్
గలుగవు; బెట్టు సూపిన శిలంబిఁ గొట్టక యుండెదో? మిత్రుఁడా.

. సుజనులు చేరి యేలికకు శోభ ఘటింతురు; తాము మందు; ర
క్కజనులు రెండుపక్షములకుం బ్రియాపహు లౌదు; రంత యున్
నిజము; మరంద మాను చవనీజము రాజిలఁ జేయు షట్పద
వ్రజములుఁ; పుత్రిష్వ లాశ్మశరుబాధకకృత్యము లౌను; మిత్రుఁడా.

. సేవకు లెప్పుడుం బ్రభుకు జీవన మిచ్చెదు రేఁ డొకప్డు దాఁ
దీవర పడ్డఁ, దాము వటు తీవ్రత నూపక, నమ్రి లోట మేఁ;
లేవిధి నన్నఁ, దొల్కరిని నేలు భయంకరవాద మాచు రాఁ,
గ్రేవల నీటివర్బ్బులులు కింటికి నంగుట లేదె? మిత్రుఁడా. 171

చ. జగతిని గింజులోఁ దవకు శక్తివిశేషము దానిఁ బూన మేల్;
తగుదు నటంచు నన్నిటికిఁ దా మును సిద్ధపడం బ్రశస్తమే?
ఖగసముదాయముల్ తమకుఁ గాళులునుం గల వంచు నిక్కుచున్,
మృగములవృత్తిఁ బూని చరియించిన లగ్గగు నయ్యె? మిత్రుఁడా. 172

ఉ. ఏలిక, చిత్తమెట్లు పరిసరించిన నట్ల వసించు; లెంకకున్
మేలు తదానుకూల్యము సుమీ; విపరీతము నీతి గాదు; వా
తూలవశంబు లంబువము తోరపుధారలు; మాఱు మాఱుచుం
దాలను; ఛత్రి మధ్యగుఁడు దాల్ప వలెం దగినట్లు; మిత్రుఁడా. 173

ఉ. ఏన మహాంశభంగికుఁడ నేలిక కంచును బొంగ రాదు; త
న్మాని పరిధానఁ జేయు యజమానుఁడు కొండొకవేళ నన్యనిన్;

భూనుతకీర్తి భూరితరభూతియుఁ గాంచినధామనామఖ
స్థానపురంబు లంబుధికి దవ్వయి పల్లెలు గావె? మిత్రుఁడా.

ఉ. ధారుణినాథునొద్దను బ్రధానుఁడు కావుటఁ బూరుషుండు వి
స్తారవిభూతి నొందినను, దప్పక మృత్యుముఖస్థకల్పుఁ డే;
వారిధియోర ముఖ్యతరభావ ము నొందుటఁ, బట్టణంబు బే
హారమువృద్ధి గాంచినను, నాపద కగ్గము గాదె? మిత్రుఁడా.

ఉ. మంత్రి యైనవాఁడు యజమానునిఁ, గాపథమందుఁ బోనియ
క్కెంతయు నేర్పుతోడ మరలించి, సుఖించును దాను భూజనం;
బంతము లేనిసాగరమునం దల లుయ్యెల లూఁచునావ ద్వీ
పాంతర మెయ్యెఁ జేర్చి ముద మందఁ డె మాలిమికాఁడు! మిత్రుఁ

చ. ఒడయనిపాలఁ బాలసుఁ డె యుండినచోఁ, దనవాని నైన న
క్కడ మతి చేర నీయఁ డనఁగా, నిఁక నవ్వులమాట యేటికిన్?
గడపకడం బరుండి శునకంబు నె చేరఁగ నీదు కుక్క; యె
వ్వడువున నింక నర్థులను వాకిటఁ గాచిడ నిచ్చు? మిత్రుఁడా.

ఉ. ఊర్విని లంచగొండితన ముండినవాని మనంబు శుద్ధమే?
యిర్వుర కేసుహస్తముల నెయ్యది నిండిన మొగ్గు నద్దెసన్;
బర్వెడుత్రాసుముల్లు, తనపార్శ్వపుఁజిప్పల దేని నంతురో
బ ర్వధికంబు, దానిదెస బాగుగ వ్రాలుట లేదె? మిత్రుఁడా.

ఉ. ధర్మ మధర్మ మేమిటికి ధారుణి లంచము పట్టుమొండికిన్?
బేర్మిని వానికింత పడ వేసిన, నెంతకు నైనఁ బాల్పడున్,
గూర్మిని దన్నుఁ బెంచుదొరకొంపను దోఁపఁగ వచ్చుదొంగవాఁ
డర్మిలిఁ బెట్టు నింత, పెరుఁగన్నము, కుక్క పరుండు; మిత్రుఁడా.

చ. ఒడయనిపాల నెంతచన వుండిన, నీచు మహాత్ముకన్న నె
క్కుడగునె; వాఁడు గర్వపడఁ గూడదు వారలయొద్దఁ; బిల్లి యె

చ. మితముగ మాటలం దెలచి మెల్ల నగున్ రతనాలనవ్వు యో
గ్యతముఁ; డయోగ్యుఁడో పెలవివాఱఁగ బిగ్గర నవ్వు; నెట్లనన్,
గుతుకముఁ జెందె స్వాతిచినుకుల్ పడ మోమరవిచ్చు శుక్తి; దా
నతివివృతాస్య మై తెలుపు హర్షముఁ గోఁచురుఁ ప్పు; మిత్రుఁడా. 1

ఉ. పిన్నటనాఁటనుండి కనిపెట్టుక యుండినవార టుండఁగా,
మన్ననఁ బొందు చుంత్రి నతఁడుం జనుదెంచినయట్టివారె; యె
ట్లన్నను, గన్న కూఁత్రును నాలఁ బిటేందికిఁ దోఁచి శృంగముల్
పన్నుగ నెత్తిమీఁది వలి బంగరుసొమ్ములఁ దాల్చు; మిత్రుఁడా.

చ. చపలులమాట నమ్మి యొకసాహసకార్యము సాగించినన్;
విపులవిపత్పరంపరల నేఁగుట తప్పదు నమ్మి పిమ్మటన్;
గపటము గాదు; శారదఘనస్తనితంబులనద్బికన్ దటా
కపుఁ బరివాహమం దెఱవ గాసిలు వేసఁగివేట్ల; మిత్రుఁడా.

చ. నలునును నల్పుగాఁ దలఁప నాయమె? కొండల కైన మూలముల్
నలును లె; కానఁ బ్రాజ్ఞుఁడు మనంబున దీని స్మరింపఁగా వలెన్;
నలునును బోలువిత్తనము నం బెను మట్టి జనింప లే దొకో?
నలుఁగడఁ గాఱుకొన్నవని నల్పున నీ అయి పోవొ? మిత్రుఁడా.

చ. తన కొకలోప ముండినను దాఁగుట గల్గును; గాని శేనినోఁ
బని గల దయ్యా దాఁగను, బ్రపంచమునందలి యేరి కేనియున్?
జినుఁగు ను మాపు డాఁగుఁ గలచేలచెఱంగులు బైట వచ్చునే?
చనయెడుఁ గాక కుచ్చెళులసందుకుఁ, గచ్చలలోకి? మిత్రుఁడా.

చ. తనకడ నున్నలోపములు దాను గ్రహించుకొనంగ శక్తి లే
కనఘుల దూఱుటల్ సహజ మాను దురాత్ములు; కెట్టు లన్న, నో,
చనములు గల్గునట్టిప్రతిజంతువు మెచ్చెడిలోకబాంధవున్
మనమునఁ గోటఁ డించుకయు మంచిగ నెంచు నటయ్యా? మిత్ర

కలిగియు నుండుట మేలు; మఱి కల్గకయున్నను మేలె; గాని తాఁ
గలిగియు లేనియట్టి దగు కల్మి యనర్థకరంబె యెన్నఁడున్;
దలఁపఁగఁ బూర్ణిమానిశ యదౌ నిశీథిని గాక, చంచలా
వలితపయోద మేదురనిభావరి పాంథున కెట్లు? మిత్రుఁడా. 192

ఎంత గడించుకొన్నఁ దను కిల్లొకచోటును లేక పోయినన్,
నెంతయు మేలు గాదు సుమి; సొంతపు లోఁగిలి యుంటయే సుఖం;
బింతయు నంత లేనె గడియించి గృహంబులఁ దెంట్లు దాఁప రాఁ,
బంతము పట్టి హైందవులు పంపరె యాలకు వాని? మిత్రుఁడా.

కవన మనన్ వచోరచన; గావున నయ్యది చేతఁ గానివా
రెవరును లేరు; గాని రస మే యుదయించుట కష్ట మందులోఁ;
దవ్వుదు మటంచుఁ బొర్యిద్యూపయి దా కిడి వండఁగ నేర్తు రందఱున్;
బొవ్వులు చక్క నంటి రుచి పుట్టునె యందఱ చేత? మిత్రుఁడా.

తా రచియించు పద్యములఁ దక్కువ యెక్కువ లెంచి తెలంగి యుం,
కూరిమి యేమి యొక్కొ? కవి కొంచెపువానిని దీసివేయలేఁ;
డారయఁ గన్న కానుపున నందపుఁ బారలఁ బెంచి లాఁతులన్
బే రడఁగింప లేఁడు గద వేరమునన్ జనకుండు? మిత్రుఁడా. 195

గుమ్మడికాయదొంగ యనఁ గొంకి బుజంబును జూచికొన్నలా
గిమ్మహి దోషి తానె తెలిఁగించు స్వచేష్టయెలఁ దన్నుఁ; బల్లులుం
గుమ్మరపుర్వులుం బలెను గ్రిమ్మరుచున్ పగలింట నింట స
ర్పమ్ములు వృశ్చికమ్ములును, రాత్రులు దిర్గుదురుఁ గాని? మిత్రుఁడా.

పరమదరిద్రుఁడు, జేయ సులభంబు మహాధనవంతుఁ గా; మహా
త్తరధనవంతునష్టము వడప్పుట కష్టతరంబు; వేసఁగిం
బూరదయు నెండునట్టి చెఱువుం జలపూర్ణము సేయ వచ్చు; దు
ష్కర మగుఁ గాదె నిండునది గండిని గట్టఁగ వాన? మిత్రుఁడా.

ఉ. చా గొనరింప నేరికిఁ బ్రపంచమునన్ సులభంబు గాదు ను;
మ్యోత్ర గొనరింప నెందులకు నొక్క నిమేషము పట్ట దేరి కే
లా గన, నాకుఁ జీల్చ గటులం బలురంగులు వేయఁ గష్ట; మా
నూఁగును రాల్చ వేయుటకు నూఱు ప్రయత్నము లేల? మిత్రుఁడా.

చ. అనిశము పడ్డపాటు వృథ యౌ శతువందు నొకింత యేమఱన్;
ఘనునిమనంబు నిర్మలము; గ్రక్కున మాఱు నె యంతమాత్రిచే?
నినువవి తుప్పు పట్టిచెడు నెప్పుడుఁ దప్పక వాడ కుండినన్;
గనకపువాని కెల్లపుడుఁ గావలె నే పులిగాపు? మిత్రుఁడా. 199

చ. అదివఱ కున్నయోూ పది యాకుణనుంగున నెంచుఁ బోవునో,
మదిఁ గడుఁ దత్తఱించెదరు మానవు లిష్టఫలంబు దగ్గఱన్;
బొదుఁగుల నీడ్చుకొంచు మొదవుల్ మునిమాపల సాలసంబు గాఁ
బరువున గూడి వచ్చి, తుదిఁ బర్విడుఁ గా యిలు సూచి? మిత్రుఁడా.

చ. మవిని గల్గిభావమును మాటలతోఁ దెలుపంగ నేటికిన్?
వదనముఁ జూచి యే తెలియ వచ్చుఁ బరేంగిత మెల్లవారు; నె
ట్లిది యనఁ జందమామ యుదయింపఁగ నున్నఁ, బ్రసన్న మయ్యెడుఁ
గద మునుమున్న దూరు; పటు గామిని నేగతి నుండు? మిత్రుఁడా.

చ. సమయము రాకమున్న జనసంఘ మసంఖ్య మె; దాని నమ్మి కా
ర్యము దలపెట్ట రాదు; తుదకం దొకకొందఱె నిల్చినారు; క
ళ్ళమునను నూర్చు రాశి సకలంబును గొత్తకు వచ్చునే? పలా
లము తుదిఁ దూరు పెత్తినఁ బలాయన మై చనుఁ గాదె; మిత్రుఁడా.

ఉ. సారవిహీనమై బహుళసంకటముల్ గలిగించు హేయసం
సారము పామరుల్ ప్రియతమంబుగ నెంచి చరంతు; రెట్లనన్,
ధారుణి మాంసశూన్యమును దంతవిఘాతముఁ బూతిగంధమౌ
తోరపుటెమ్ముకం గని కుతూహల మొందదె వేపి? మిత్రుఁడా.